# ఆంధ్రపత్రిక

3/7616



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 257 TUESDAY 20th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# హిందూ ధర్మశాస్త్రసంస్కరణబిల్లు: సెలెక్టు కమిటీ నివేదికపై

## పునః పరిశీలన

### అధినివేశశాసనసభలో అధికసంఖ్యాకుల ఆమోదం

### సామరస్యంతో ప్రతి అంశాన్ని సమీక్షించగలమని నెహ్రూ హామీ

**ఢిల్లీ, డిసెంబరు 19: హిందూ ధర్మ క్రోడీకరణ బిల్లును గూర్చి సెలెక్టు కమిటీ తయారుచేసిన నివేదికను పరిశీలించుటకు భారత అధినివేశ శాసనసభ సమ్మతించుచు నేడు తీర్మానము చేసినది. ఈ తీర్మానము సభలో అత్యధిక సంఖ్యాకులచే ఆమోదింపబడెను. 11 మంది మాత్రమే ఆ తీర్మానమునకు ప్రతికూలంగా వోట్లు నిచ్చిరి.**

హిందూ ధర్మ క్రోడీకరణ చట్టపు సెలెక్టుకమిటీ నివేదికను ఇండియా పార్లమెంటు పరిశీలింపవలెనా అక్కరలేదా యను తీర్మానము విషయమై పార్లమెంటులో జరిగిన చర్చను ఇంతటితో ముగించుటకు సభవారు అంగీకరించిరి.

#### నెహ్రూ ప్రకటన

ప్రధానమంత్రి పండిట్ నెహ్రూగారి అభిప్రాయ ప్రకటనకై సభవారు ఆతురతతో నిరీక్షించిరి. నెహ్రూగారు యిట్లు చెప్పిరి: ఈ చట్టము యొక్క ప్రధాన మూలసూత్రములకు ప్రభుత్వవర్గము కట్టుబడియున్నది. కాని యీ చట్టములోని

(2వ పేజీ చూడుము)

## దక్షిణాఫ్రికా భారతీయ సమస్యపై రౌండ్‌టేబుల్ సభ

### ఫిబ్రవరి 6న కేప్‌టౌన్‌లో తొలిచర్చలు

### భారతప్రభుత్వ విదేశాంగశాఖ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 18: దక్షిణ ఆఫ్రికా భారతీయుల భవిష్యత్తును గూర్చి రౌండ్ టేబుల్ సమావేశం జరిపే విషయమై సమాలోచనలు సాగించే నిమిత్తం ఇండియా, పాకిస్థాన్, దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వ ప్రతినిధులు ఫిబ్రవరి 6 తేదీనాడు కేప్ టౌన్‌లో సమావేశం అవుతారని భారతప్రభుత్వవిదేశాంగ కార్యాలయం వారు నేడొక ప్రకటన చేశారు.

ఇటువంటి సంభాషణలుజరిపే విషయంలో ఈ మూడు ప్రభుత్వాలు కొన్ని ఏర్పాట్లకు అంగీకరించినవని ఫిబ్రవరి సమావేశంలో ఈ రౌండ్ టేబుల్ సమావేశాన్నిగూర్చి, అందులోఏయే విషయాలు చర్చించాలి అన్నదానినిగూర్చి మూడు దేశాల ప్రతినిధులు సమాలోచిస్తారని గూడా ఈ ప్రకటన తెలియజేస్తున్నది

## ఐక్య ఇండోనీషియా మంత్రివర్గ నిర్మాణం

### నలుగురు సభ్యులతో కమిటీ నియామకం

బటేవియా, డిసెంబరు 18: ఇండోనీషియా సంయుక్త రాష్ట్రముల మంత్రివర్గ సభ్యులను ఎంచే నిమిత్తం నలుగురు వ్యక్తులతో ఒక కమిటీని నియమించినట్లు, అధ్యక్షుడు డా॥ సోకర్నో నేటి రాత్రి ప్రకటించాడు. డా॥ సోకర్నో ఇండోనీషియా సంయుక్త రాష్ట్రముల తొలి అధ్యక్షుడుగా నిన్ననే పదవీ స్వీకారం చేశాడు.

రాజ్యాంగ చట్టంలో ముగ్గురు సభ్యులతోనే యీ కమిటీని నియమించాలని ఉన్నా, లోగడ హేగ్‌లో కుదిరిన ఒడంబడికకు సరియైనను నలుగురు సభ్యులతో యీ ఒడంబడిక నియమించినట్లు డా॥ సోకర్నో వెల్లడించాడు.

డిసెంబర్ 27న, సర్వాధికారమును ఇండోనీషియా పరం చేసేటప్పుడు ఉత్సవాల సందర్భంలో, బటేవియా జిల్లాలో తగిన బందోబస్తు నిమిత్తమై, జోగ్జకర్త నుంచి, 500 రిపబ్లికన్ పోలీసులు, 200 మంది డచ్చివారి అధీనంలో పనిచేసే ఇండోనీషియన్ పోలీసులు వస్తున్నారని డచ్చి అధికారులు యివ్వాళ ప్రకటించారు. బటేవియాలో ఉన్న 3000 సివిల్ పోలీసులకు తోడ్పాటుగా 6 వేల రిపబ్లికన్ సైన్యాలు గూడా వస్తవి. ఒక్క బటేవియా ప్రాంతంలోనే 30 వేల డచ్చి సైన్యాలు కేంద్రీకరింపబడునని నమ్మకమైనవారి ద్వారా తెలుస్తున్నది.

### రాజకుమారి హాజరు

న్యూఢిల్లీ, డిసెంబరు 19: డిసెంబరు 27వ తేదీన జరిగే ఐక్య ఇండోనీషియా అవతరణోత్సవానికి భారతప్రతినిధిగా ఆరోగ్యశాఖమంత్రి శ్రీమతి రాజకుమారీ అమృతకౌర్ హాజరవుతారని ప్రధాని నెహ్రూ నేడుపార్లమెంటులో ప్రకటింపగానే సభ్యులందరూ ఐక్యకంఠంతో హర్షధ్వానాలుచేశారు. హుస్సేన్ ఇమాం వేసిన అల్పవ్యవధిప్రశ్నకు సమాధానంగా నెహ్రూ ఈ ప్రకటనచేశారు.

## మరనాగళ్లతో వ్యవసాయం

### అనుకున్నంతగా జరగలేదట

### ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబర్ 18: ట్రాక్టర్లను ప్రయోగించి, యాంత్రికసహాయంద్వారా వ్యవసాయం చేయించే కార్యక్రమంలో ప్రభుత్వం మొదట అంచనా వేసుకున్నన్ని యెకరాలభూమిని సాగు చేయలేకపోయింది; అని ఆహారమంత్రి జయరామదాస్ దౌలత్‌రామ్ యీవేళ పార్లమెంటులో ప్రకటించారు.

దేశబంధుగుప్తగారు వేసినఒక ప్రశ్నకు సమాధానంగా ఆయన యీదిగువ వివరాలు తెలియజేశారు:

"ఇలాంటి అపజయానికి కారణమేమిటంటే, కొన్ని ట్రాక్టర్లు పనికిరాకుండా చెడిపోయినై. విడిసామానులు సరిగాలభ్యం కాలేదు. పనులు మొదలైన ప్రధాన భాగాలు అందటం ఆలశ్యమైంది; యీ యంత్రాలన్నిటినీ యెప్పటికప్పుడు మంచిస్థితిలో వుంచటానికి తగిన కర్మాగారాలు లేవు; తగిన శిక్షణపొందిన సిబ్బందిలేదు.

మొత్తం 1318 ట్రాక్టర్లూ, 25 బుల్

(2వ పేజీ చూడుము)

## కలకత్తాలో పోలీసులపై బాంబుల ప్రయోగం

### అసిస్టెంటు కమిషనర్‌కు గాయాలు: దుండగీళ్ల అల్లరి: పోలీసులకాల్పులు

కలకత్తా, డిశంబర్ 18: కడచిన రాత్రి, దక్షిణ కలకత్తాలో, దుండగీళ్లు కొంతమంది తిరుగుబాటుచేసి ఒక పోలీసు దళంమీద బాంబులు విసిరారు. ఒక అసిస్టెంటు కమిషనరుకూ నలుగురు పోలీసులకూ గాయాలు తగిలినై.

పోలీసువారు ఆదిలో బాష్పవాయువు ప్రయోగించారు. అనంతరం తుపాకులు కాల్చారు. ఈ దుండగీండ్రు వచ్చేపోయే ట్రాము కారులను ప్రతిఘటించారు. పోలీసు కాల్పులవల్ల యెవ్వరూ గాయపడలేదు. కమ్యూనిస్టుల ఆధిపత్యం క్రింద నడుస్తున్న ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ఆధిపత్యం క్రింద యేర్పాటు చేయబడిన ఒక బహిరంగ సభకు ప్రతిఫలంగా యీ సంఘటన జరిగింది. డిశంబర్ 15వ తేదీన ప్రెసిడెన్సీ జైల్లో జరిగిన సంఘటనలలో, పోలీసువారి చర్యలను ఖండించటానికిగాను యీ బహిరంగ సభ యేర్పాటు చేశారు. ఆ జైలు సంఘటనలలో పోలీసువారికి 12 మందికీ ఖైదీలకు 24 మందికీ గాయాలు తగిలినై.

ఈ సమావేశానంతరం ఒక ఉత్సవాన్ని బయలుదేరదీశారు. నినాదాలు చేస్తుంటూ అలీపూర్ సెంట్రల్ జైలు వైపు కవాతుగా నడచిపోవటం ప్రారంభించారు. ఈ ఉత్సవం రూసా, హజ్రారోడ్ల కూడలి కి వచ్చేసరికి ప్రదర్శనంలోనివారు, వెంటవస్తున్న పోలీసు దళంవారి మీద బాంబులు విసిరారు. పోలీసువారు బాష్పవాయువు ప్రయోగించి గుంపును చెదరగొట్టటానికి ప్రయత్నించారు. అది లాభంలేకపోగా 7 వరుసలు తుపాకులు కాల్చారు.

చెదరిపోయిన యీ గుంపులోని కొంతమంది, తిరిగి రూసారోడ్డు మీదకువచ్చి వచ్చేపోయే ట్రాము కార్లను ప్రతిఘటించటం ప్రారంభించారు. బాంబు ప్రయోగంవల్ల ఒక ట్రామ్ కారు డ్రైవరుకు దెబ్బలు తగిలినాయి. రాత్రి 10 గంటల అనంతరం పరిస్థితిని అదుపులోకి తెచ్చారు.

ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న అసిస్టెంటు పోలీసు కమిషనరూ, మరొక సాయుధ పోలీసూ ప్రమాద స్థితిలో వున్నారు.

పోలీసు దళంలో దెబ్బలు తగిలిన యితరులు ఒకరు పోలీసు వైర్‌లెస్ ఆపరేటరు మరి యిద్దరు పోలీసు లారీడ్రైవర్లు బాంబు దెబ్బలవల్ల 'వైర్‌లెస్ వాన్' సంపూర్ణంగా శిధిలమైపోయింది.

హుగ్లీ జిల్లా, సిరాంపూర్ ఫిర్కాలోని మహేశ్ పోలీసు స్టేషనుకు సంబంధించిన యిద్దరు పోలీసు అధికారులను, ఈ వేళ, యెవరో కత్తులతో పొడిచి వాళ్లవద్దవున్న ఆయుధాలను లాక్కున్నారు.

ఆ ప్రాంతంలో కమ్యూనిస్టులు ఒక బహిరంగ సభ యేర్పాటు చేశారు. ఈ అధికారులు వెళ్లి ఆసమావేశాన్ని అక్రమ సమావేశంగా ప్రకటించి తిరిగి స్టేషనుకు వస్తుండగా, తోవలో ఈ సంఘటన జరిగింది

## 1951 నాటికి దేశం స్వయంపోషకం కావడానికి రైతులంతా సస్యాభివృద్ధి కార్యక్రమాన్ని తీవ్రతరం చేయాలి

### —భారత కిసాన్ కాంగ్రెస్ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, డిసెంబరు 18: 1951 నాటికి ఇండియా స్వయంపోషకమయ్యే విధంగా ఆహారధాన్యాలను అధికంగా ఉత్పత్తిచేయడంలో రైతులంతా నిమగ్నులు కావాలని ఆచార్యరంగా అధ్యక్షతక్రింద ఇచ్చట సమావేశమౌతున్న భారత కిసాన్ కాంగ్రెస్ ఒక విజ్ఞప్తి చేసింది.

దేశాన్ని ఆహార విషయంలో స్వయంపోషకం చేయడానికి రైతులు అన్నివిధాలా కృషిచేయగలరని, భారత ప్రధానికి హామీ నిస్తూ, రైతులకు పనిముట్లు, సరియైనధరలకులభించేటట్లు చూడవలసిందిగా అయన్ను అర్థిస్తూ కిసాన్ కాంగ్రెస్‌వారు ఒక తీర్మానాన్ని ఆమోదించారు.

కేంద్రంలోను, రాష్ట్రాలలోనుగూడా వ్యవసాయ వస్తువ్యవస్థలను ఏర్పాటుచేయవలసిందని, అందువల్ల రైతులకు ఋణం ఋణం మార్కెట్లవల్ల ఎటువంటి నష్టమూ వాటిల్లకుండా వుంటుందని ఈ కాంగ్రెస్ వారు ప్రభుత్వాన్ని అర్థించారు.

1932నుంచి అమెరికాలో చలామణిలో వుంటున్న విధంగా ఇండియాలో గూడా ధాన్యానికి కనిష్టము గరిష్టముఅయిన ధరలను నిశ్చయించి, దాన్ని సంరక్షించే విధానాలను అనుసరించడం యోగ్యమనిగూడా వీరు ప్రభుత్వానికి సూచించారు.

కిసాన్ అంటే ఎవ్వరు అన్న పదాన్ని గూడా ఈ కాంగ్రెస్ నిర్వచించింది. తనది కాని లేకపోతే ఇతరులది కాని గున్ని, సేద్యం చేసేవాడే రైతు. తన కుటుంబం పోషణనిమిత్తం తన పొలాన్నే గాక, ఇతరుల పొలాన్ని కట్టుబడికి తీసుకొని తద్వారానున్నా, వీలుగావున్న కాలంలో గృహపరిశ్రమలు మొదలైన వాటిద్వారాడున్నా జీవితాన్ని గడుపుతూవున్న వ్యక్తిగూడా రైతుక్రిందకే జమఅవుతాడు అని కాంగ్రెసు నిర్వచనం.

ఆంధ్రదేశంలో తుపానుల్లు దెబ్బతిన్నటువంటివన్ని, హైద్రాబాదులో కమ్యూనిస్టు చేతుల్లో నష్టపోయినటువంటివన్నీ రైతులపట్ల, రైతు కుటుంబాలపట్ల సానుభూతి చూపిస్తూ ఈ కాంగ్రెసు తీర్మానాలు చేసింది.

## సయాంరాజధానిలో కమ్యూనిస్టుల తిరుగుబాటు ప్రమాదం

బాంకాక్, డిసెంబరు 18: సయాం రాజధానీనగరంలో కమ్యూనిస్టులు తిరుగుబాటుకు ప్రయత్నిస్తున్నారనే వదంతులు వ్యాపించుటచేత, ప్రభుత్వం ముందుగా జాగ్రత్త చర్యలను అవలంబిస్తున్నది. నగరంలో 3 లక్షల చైనా ప్రజలు నివసించే చైనా పట్టణంలో రక్షకదళాలు గస్తీ తిరుగుతున్నవి.

సయాం సైన్యాలలోగూడా తీవ్ర అశాంతి ప్రజ్వరిల్లుతున్నదని వార్తలు రాగానే, గతరాత్రి పోలీసులు, సైన్యాలు రైఫిళ్లతోనూ, మరఫిరంగులతోనూ సాయుధులై గస్తీ ప్రారంభించారు. బాంకాంగ్ విమానాశ్రయానికి, సైనికరక్షణ ప్రాంతాలకు వెళ్లే ప్రధానరోడ్లపై ఆటంకాలు కల్పించారు.

కమ్యూనిజమును ప్రతిఘటించుటకు సయాం ప్రభుత్వం కృతనిశ్చయమైనట్లు అధికారరీత్యా తెలియవచ్చింది. అయితే చైనా కమ్యూనిస్టుల పంచమాంగదళ చర్యలను, దీర్ఘకాలం సయాం ప్రతిఘటించగలదా అనే సంశయం సయాం సేనాపతులలో పొడసూపుతున్నది.

ప్రస్తుత పరిస్థితుల్లో, చైనావారి వత్తిడి రెండు మూడు నెలల్లో యింకా యెక్కువైతే, కమ్యూనిస్టు చైనాతో యేదో ఒక ఒప్పందానికి రావడం మంచి మార్గమని, చైనా ప్రభుత్వాధికారులు, ప్రతికూల పక్షంవారు వ్యక్తిగత అభిప్రాయాలను వెలిబుచ్చారు.

### మాల్కొం మాక్డొనాల్డ్ ప్రయాణం

ఆగ్నేయ ఆసియాలో బ్రిటిష్ కమీషనర్ జనరల్‌గా ఉన్న మాల్కొం మాక్డొనాల్డ్ రేపు బాంకాక్ కు వస్తున్నారు. సయాం రాజధానిలో పరిస్థితి అశాంతంగా ఉన్నదని తెలిసినాగూడా యీ యన ప్రయాణం మాయిదా వేసుకోలేదు.

## చక్కెర పరిస్థితిపై పార్లమెంటు చర్చ

న్యూఢిల్లీ, డిసెంబరు 19: అధినివేశ శాసన సభాధ్యక్షుడు జి. వి. మావలంకర్ గారు చక్కెర పరిస్థితిపై కేంద్ర శాసనసభలో చర్చ డిసెంబరు 23 తేదీన గాని, 24వ తేదీగాని జరుగుతుందని నేడు ప్రకటించారు.

## 'సరిహద్దుసంఘ నియామకము నాయకత్రయ నివేదికకు విరుద్ధము'

### విజయవాడ సభలో తీర్మానము

విజయవాడ, డిసెంబరు 18: చెన్నరాష్ట్ర ప్రభుత్వము నియమించిన రాష్ట్రవిభజన సంఘము వారు 1950 జనవరి 26 లోగా ఆంధ్రరాష్ట్రమును తాత్కాలిక సరిహద్దులతో విడదీయవలెననియు, ప్రస్తుతము సరిహద్దుసంఘ నియామకమునుగూర్చి యోచించుట, ప్రభుత్వామోదము బడసిన నాయకత్రయ నివేదికకు విరుద్ధమనియు, నేటి సాయంత్రము విజయవాడ దర్శనీయాన మందిరములో శ్రీ మిన్నికంటి వెంకటసుబ్బారావుగారి అధ్యక్షతను జరిగిన సర్వోత్తమసభలో తీర్మానింపబడెను.

తాత్కాలికముగా మద్రాసు రాజధాని నగరముగా వుండవచ్చుననియు, తిరుపతి శ్రీ బాగ్ ఒడంబడికను దృష్టిలోనిడి ఆంధ్రరాష్ట్ర శాసనసభ్యులు రాజధాని నగరమును నిర్ణయించుకొనవచ్చుననియు ఉద్ఘాటించుచూ, తీర్మానములో ఇట్లు సూచించిరి. ఈమధ్య డా॥ కట్టమంచి రామలింగారెడ్డి సూచించినట్లు విద్యాకేంద్రమును వాల్తేరులోనుంచి, ప్రధాన న్యాయస్థానమును రాయలసీమలో ఏర్పాటుచేసి, విజయవాడలో ప్రభుత్వ కార్యాలయముల నెలకొల్పుట, శ్రీబాగ్ ఒడంబడికకు అనుగుణముగా నుండును.

మాదల శ్రీరామమూర్తి, పావులూరి నాగభూషణం, పి. సీతారామయ్య గారు మొదలైనవారు తీర్మానముపై మాట్లాడిరి.

(స్వ. వి.)

ఈ తరుణములో మీకు మీ మిత్రులకు
చేనేతవస్త్రములు కొనండి

## కో-ఆప్టెక్స్

క్రిస్టమస్‌కు నూతన సంవత్సరమునకు

ఈ నగరములోను, జిల్లాలలోని సేల్సు ఎంపోరియము లన్నిటియందును అనేక ఆహ్లాదకరమైన రకములు కలవు. అది కో-ఆప్టెక్స్ అయినచో, ఈ తరుణపు బహుమతి యెంతో ప్రాముఖ్యం కలిగి యుండును.

**అందరికి అందుబాటులో నున్న ధరలు**

| ధోవతులు | ఒక్కొకటి | చీరలు | ప్రింటెడ్ కలర్ వాయిల్సు | |
|---|---|---|---|---|
| 4 మూళ్లు, చలవ చేసినవి | రు 1-8-0 | 6, 7, 8, 9, గజములు - లేసుతో గాని లేసు లేకుండగాని | గజం 1 కి | రు 1-9-6 |
| 8 ,, నాణ్యమువి | రు 4-4-0 | | వాయిల్ చీరలు | |
| 8 ,, మేలిరకము | రు 5-0-0 | | 6 గజాలు | రు 11-4-0 |

| హనీకూంబ్ తువాళ్లు | ఒక్కొకటి | చేతిరుమాళ్లు | | దోమతెరలు | |
|---|---|---|---|---|---|
| స్పెషల్ | రు 1-4-0 | డజను 1 కి | రు 1-8-0 | (రెడీమేడ్-సింగిల్ మంచం సైజు) | |
| 1 వ రకము | రు 1-1-0 | | | 1 వ రకము | రు 7-0-0 |
| [illegible] వ రకము | రు 0-13-0 | | | 2 వ రకము | రు 3-4-0 |

మదరాసు హాండ్‌లూం వీవర్సు ప్రావిన్షియల్ కో-ఆపరేటివ్ సొసైటీ లి.,
హాలోవేస్ గార్డెన్సు, 34 పాంథియన్ రోడ్డు, ఎగ్మూరు, మదరాసు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ పుష్య శు॥ పాడ్యమి 1949సం॥ డిసెం॥ 20 మంగళవారం

సం॥ పాడ్యమి రా 10-10 మూ ప 8-24 వర్జ్యం ప 1-55 ల 3-24 కు.

శు॥ విదియ డిసెం॥ 21 బుధవారం

బు॥ విదియ రా 8-24 పూషా ప 2-9 వర్జ్యం రా 9-55 ల 11-29 కు.



ఆంధ్రపత్రిక

విరోధి సం॥ పుష్య శు॥ పాడ్యమి.

మంగళవారం

## కాశ్మీరు సమస్య పరిష్కార మార్గం

"కాశ్మీరు వివాదలో ఇరుపక్షములను సంతృప్తిపరచవలెనని చేతగాని ప్రయత్నము చేయుట వలననే ఐక్యరాజ్యసమితి కమిషన్ దెబ్బతిన్నది" అని కమిషన్‌లోని చెకస్లవేకియా ప్రతినిధి తమ ఉప నివేదికయందు వెల్లడించిన యభిప్రాయమును బట్టి కాశ్మీరు వివాదము కమిషన్ శక్తికి మించినదిగ పరిణమించుటకు కమిషన్ వారు ఖచ్చితమైన విధానమును అనుసరించి, తాము న్యాయమైనదిగ భావించిన నిర్ణయములను అమలు జరుపలేకపోవుటే ముఖ్య కారణమని స్పష్టమైనది. 1948 వ సంవత్సరము ఆగస్టు 13 వ తేదీ తీర్మానమును ఇరుపక్షములచే అంగీకరింపచేసి, ఏదో విధముగ యుద్ధ విరమణను సాధింపవలెనను ఉత్సాహములో తమ చర్య మున్ముందెట్టి విషాద ఫలితములకు దారితీయునో కాశ్మీరు కమిషన్ వారు ఆలోచింపలేదు. యుద్ధ విరమణకు, సేనల ఉపసంహారమునకు, యుద్ధవిరమణ హద్దు నిర్ణయమునకు మధ్య ఎక్కువ వ్యవధి ఉండరాదని, యుద్ధవిరమణ ఒడంబడిక జరిగిన వెంటనే సైనిక ఉపసంహారము ప్రారంభము కావలెనని ఆ సందర్భమున మేము హెచ్చరించియుంటిమి.

1948 ఆగస్టు 13 తీర్మానమును విడివిడిగ గాక మొత్తముగనే అమలుజరిపిన కాశ్మీరు సమస్యాపరిష్కారము సుకరమగునని సూచించి యుంటిమి. భారత ప్రభుత్వము తన బుజువర్తనమును ప్రకటించుకొనవలెనను ఆత్రములో సంస్థాన విభజనకు దారితీయుగల ఆగస్టు తీర్మానమును అంగీకరించుట భావ్యము గాదని తెలిపియుంటిమి. 1948 ఆగస్టు-1949 జనవరి మాసముల మధ్య భారతప్రభుత్వము యుద్ధవిరమణ ఒడంబడికను ఆమోదించువిషయమున, ఆమోదించిన ఒడంబడికను అమలుజరుపు విషయమున తొందరపాటు, ఆత్రము ప్రదర్శింపకుండిన కాశ్మీరు కమిషన్ ఈ సమస్యను "ఆగస్టు 13 తీర్మానము"నకు సమగ్రానుకూలముగ అన్వయము చెప్పి ఇంతకష్టపెట్టి మొనర్చుటకు అవకాశ ముండెడిదిగాదు. ఏ ఒక్క విషయమునను భారత ప్రభుత్వ వైఖరిని తప్పుపట్టుటకు వీలుండెడిదగాదు. భారతప్రభుత్వము తిరస్కరించిన పరిష్కార నియామక ప్రతిపాదనను తిరిగితమ అంత్య నివేదికలో కాశ్మీరు కమిషన్ వారు ప్రస్తావించి యుండెడివారు గాదు.

కాశ్మీరు కమిషన్ తన అసమర్థతను కప్పిపుచ్చుకొనుటకు భారత ప్రభుత్వమును ఎక్కువగను, పాకిస్తాన్ ప్రభుత్వమును కొంత తక్కువగను నిందించుట జరిగినది. ఎప్పటి సమస్యల నప్పుడు సమగ్రముగ పరిశీలించి ధర్మమార్గమున పరిష్కరించుటకు ప్రయత్నింపక ప్రతి ఒక్క విషయమును వాయిదావేయుచు వచ్చినందువలన హఠాత్తుగ కాశ్మీరు కమిషన్ అన్ని సమస్యలను ఒకేసారి పరిష్కరింపవలసి వచ్చెను. ఇందుకు తగిన శక్తిగాని, అవసరమైన సామర్థ్యముగాని కాశ్మీరు కమిషన్‌కు లేనందున మధ్యవర్తి నియామక ప్రతిపాదనను చేయవలసివచ్చెను. ప్రపంచ దృష్టిని తమ కృషి వైఫల్యమునుండి మరల్చుటకు కమిషన్‌వారు చేసిన ఈ ప్రయత్నము చెకస్లవేకియా ప్రతినిధి ప్రత్యేక నివేదికవలన విఫలమైనది.

కాశ్మీరుకమిషన్ అనుసరించిన ఈ ఆత్మవినాశక విధానమువలన, పాకిస్తాన్ దురాక్రమణ వ్యవహారము అడుగునపడి, భారతప్రభుత్వము కాశ్మీరు సంస్థాన అధికార దఖలుపత్రము నంగీకరించి, ఆ సంస్థానమును భారతదేశాంతర్భాగముగ పరిగణించుట మహా తప్పిదమువలె అభివర్ణింపబడుచున్నది. 1948 జనవరిలో భద్రతామండలి భారతదేశ ఫిర్యాదును విచారణకు తీసుకొనినపుడె భద్రతామండలి జమ్మూ కాశ్మీర్ సంస్థానము భారతదేశాంతర్భాగమని భద్రతా మండలి గుర్తించినది. ఈ పరిస్థితిని పాకిస్తాన్ అంగీకరించినది. కాశ్మీరు సంస్థానాధీశ్వరుడు సంతకముచేసిన అధికార దఖలు పత్రము చెల్లనేరదను పాకిస్తాన్ వాదము సహేతుకమైన, భద్రతామండలి భారతదేశ ఫిర్యాదునే విచారించుటకు వీలుండదు. జమ్మూ, కాశ్మీరు మహారాజా తన అధికారమును యావత్తు భారతప్రభుత్వమునకు దఖలు పరచిన కారణముగ ఆ సంస్థానము భారతదేశాంతర్భాగమైనదనియు, కనుక పాకిస్తాన్ ఆ సంస్థానముపై జరిపిన దురాక్రమణ భారతదేశముపై జరిపినట్లె యగును గనుక పాకిస్తాన్ అంతర్జాతీయ ధర్మసూత్రములకు విరుద్ధముగ ప్రవర్తించినట్లయినదనియు, అందువలన పాకిస్తాన్ శిక్షార్హమైనదనియు భారత ప్రభుత్వము ఫిర్యాదు చేసెను. ఈ నాడు పాకిస్తాన్ ప్రతినిధులు వాదించినట్లు కాశ్మీరు మహారాజా అధికారము దఖలుచేయుట చెల్లకున్న కాశ్మీరు సంస్థానము భారతదేశాంతర్భాగము కాజాలదు; పాకిస్తాన్ భారతభూభాగముపై దురాక్రమణ జరిపినట్లు కాదు. భద్రతామండలి ఈ యంశమును విచారించి నిర్ణయము చేసిన, ఆ నిర్ణయము పాకిస్తాన్ వాదమునకు అనుకూలముగ నుండిన కాశ్మీరు కమిషన్ నియామకమునకు అవసరమే యుండెడిదిగాదు. భద్రతామండలి భారత ప్రభుత్వ ఫిర్యాదును పరిగణించి విషయమును సమగ్రముగ విచారించి పరిష్కారమునకు ప్రయత్నింపమని కాశ్మీరు కమిషన్‌ను నియమించుటలోనే కాశ్మీరు మహారాజా అధికార దఖలు ఒడంబడిక చట్టబద్ధమైనదని ధ్రువపడినది.

ఈ విధముగ నిర్ణయమైన యంశమును పాకిస్తాన్ ఇపుడు తిరిగి ఒక క్రొత్త సమస్యగ ప్రతిపాదించుటయు, కాశ్మీరు కమిషన్‌లోని బెల్జియం ప్రతినిధి పరిస్థితులు తీవ్రమగుటకు అధికార దఖలు ఒడంబడిక ననుసరించి భారత రాజ్యాంగపరిషత్తు తీసుకొనిన చర్యలు కారణమని వాదించుటయు విపరీతముగ నున్నది. 1949 నవంబరు 21 వ తేదీన భారత ప్రభుత్వ విదేశాంగశాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిర్జా శంకర్ బాజ్పాయ్ కాశ్మీరు కమిషన్ అధ్యక్షునికి వ్రాసిన లేఖయందు పాకిస్తాన్ వాదమును తగిన ఆధారములతో ఖండించియున్నప్పటికిని బెల్జియం ప్రతినిధి దీనినొక ప్రముఖ సమస్యగ చిత్రించుటను బట్టి కాశ్మీర్ కమిషన్ దృక్పథము ఎంత తీవ్రముగ నున్నది స్పష్టమైనది.

కాశ్మీరు వివాద మీ విధముగ క్లిష్టమైన తరువాత భద్రతా మండలి ఇంతవరకు జరిగిన చరిత్ర నాధారముగ తీసుకొని సమస్యను పరిష్కరింప ప్రయత్నించుటవలన ఎట్టి ప్రయోజనము ఉండదు. నార్వే ప్రతినిధి సూచనను అంగీకరించి భారత- పాకిస్తాన్ ప్రతినిధులతో రాజీ సంప్రతింపులు జరుపుటకు అధ్యక్షునకు అధికారమిచ్చుచు భద్రతామండలి తీర్మానించినది. పాకిస్తాన్ తన అసాధారణ వైఖరిని, విపరీత విధానమును మార్చుకొనునట్లు ముందుచేయ కల్గిన గాని భద్రతామండలి అధ్యక్షుని ప్రయత్నములు ఫలించుటకు అవకాశమైనను ఏర్పడదు. భద్రతామండలి అధ్యక్షుడు నిర్వహింప అంగీకరించిన భారము గురుతరమైనది. వారి ప్రయత్నములు ఫలించి రెండుసంవత్సరములుగ అపరిష్కారముగనున్న కాశ్మీరు సమస్య పరిష్కారము కావలెననియే శాంతిప్రియు లెల్లరు ఆశింతురు.

## ఇండియాలో అమెరికన్ పెట్టుబడులు

### ఢిల్లీలో అనధికార చర్చలు

('ఆంధ్రపత్రిక' విలేఖరి)

న్యూఢిల్లీ, డిసెంబరు 18 : రేపు అమెరికను వ్యాపారస్థులకున్నూ, భారత ప్రభుత్వపారిశ్రామిక, వాణిజ్య, ఆర్థిక శాఖల కార్యదర్శులకున్నూ ఢిల్లీలో అనధికార సమావేశం జరుగుతుందనీ, ఇండియాలో అమెరికనులు పెట్టుబడులు సాగించడానికి గాను పరస్పర దృక్పథాలు వివరించబడలవనీ తెలుస్తున్నది.

## బ్రిటిష్ వలసలలో భారతీయుల స్థితి

### లండన్‌లో చర్చలు

లండన్, డిసెంబరు 18 : ప్రపంచమంతటా చెదురు చెదురుగా ఉన్న బ్రిటిష్ వలసరాజ్యాలలో (తూర్పు ఆఫ్రికా, పడమటి ఆఫ్రికా, పడమటి ఇండియాదీవులు, ఫిజి, మారిషియస్ దీవులలో) భారతీయుల ఆర్థిక సాంఘిక స్థితిగతుల విషయమై, అక్కడి భారతీయ ప్రతినిధులు నేడు లండన్‌లో సమావేశమై చర్చించారు. డా॥ గణేశ్, డా॥ కృష్ణకుమారియా అనే వారు వీరికి ఆతిథ్యమిచ్చారు. ఈ యిరువురు డాక్టర్లు, వలసరాజ్యాల భారతీయ సమితి అనే సంస్థను క్రొత్తగా స్థాపించిన వారు.

సమావేశంలో డా॥ గణేశ్ మాట్లాడుతూ, త్వరలో భారతదేశంలోని భారతీయులు స్వతంత్ర భారత రిపబ్లిక్ పౌరులు కాబోతున్నారు. అయినా వలసరాజ్యాలలోని భారతీయులు బ్రిటిష్ పౌరులుగానే పరిగణింప బడతారు. స్వతంత్ర భారత రిపబ్లిక్, అన్యరాజ్యాల వ్యవహారాలలో ప్రమేయం కల్పించుకోజాలదు. కాని, భారతదేశంలోని భారతీయులు, పూర్వం క్రిస్టియన్ మిషనరీలవలె, ఉపాధ్యాయుల, సాంఘిక సేవకులు మొదలైనవారు వలసరాజ్యాలలోని భారతీయులకు తోడ్పడవచ్చు" అని అన్నారు.

ఫిజీ దీవులలో పరిస్థితిని గురించి, ఫిజి శాసనసభా సభ్యుడు ఉస్మాన్ తెలియపర్చాడు.

మైసూరు విశ్వవిద్యాలయం బి. ఇ. డిగ్రీలు 1932 సం॥ పూర్వం వి గూడా మద్రాసు విశ్వవిద్యాలయం బి. ఇ. డిగ్రీతో సమంగా పరిగణించబడునని ప్రభుత్వం వారు ప్రకటించిరి.

## బర్మా సరిహద్దుల విషయమై త్వరలో నెహ్రూతో థాకిన్ నూ చర్చలు

### కొలంబో సమావేశానికి బర్మా ప్రధాని హాజరగునని విదేశాంగమంత్రి ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 18 : బర్మా సరిహద్దు సమస్యలను గూర్చి తాను పండిట్ జవహర్ లాల్ నెహ్రూతో చర్చించినట్లు బర్మా విదేశాంగ మంత్రి ఉ ఈ మాంగ్ వెల్లడి చేసారు.

బర్మా అటు చైనాను, ఇటు యిండియాను గూడా అంటుకుని వున్నది. అందువల్ల ఈ సమస్యను గూర్చి ప్రస్తుత సమస్యలు ఏమీ లేకపోయినా, ముందు ఏర్పడగల పరిస్థితులను గూర్చి మాత్రమే ఆయనతో నేను చర్చించాను అని ఆయన అన్నారు.

జనవరిలో కొలంబోలో జరుగనున్న కామన్‌వెల్తు విదేశాంగమంత్రుల సభకు బర్మాను గూడా ఆహ్వానించారని, ప్రధాని థాకిన్‌నూ ఈ సమావేశానికి హాజరు కాగలరని కూడా ఆయన ఈ సందర్భంలో వెల్లడి చేసారు.

బర్మా సరిహద్దుల విషయాన్ని గూర్చి తనకు తట్టిన విషయాలను సర్వమూ తాను పండిట్ నెహ్రూకు నివేదించినాననీ, ఆయన ఈ విషయమై బర్మా ప్రధాని థాకిన్‌నూతో ఇంకా వివరంగా చర్చించ కలవని హామీ ఇచ్చారని ఉ ఈ మాంగ్ తెలియజెప్పాడు.

బర్మా విదేశాంగ మంత్రి కలకత్తా మీదుగా రంగూన్ ఇవ్వాళ్లనే బయలు దేరారు. యీ సందర్భంలో ఆయనను కామన్‌వెల్తు దేశాల సహాయాన్ని గురించి ప్రశ్నించగా తాను నెహ్రూతో ఆ విషయమై మాట్లాడనేలేదని ఆయన తెలియజేసారు.

కామన్‌వెల్తు రాజ్యాలలో బ్రిటన్, ఇండియా, పాకిస్థాన్, సిలన్ మాకు సహాయం చేస్తామని అంటూ, మేము కోరే సహాయస్వరూప వివరాలను తెలియపరచవలసిందని కోరాయి. మేము ఆ వివరాలను వారికి అందజేసాము. కాగా ఇప్పుడు మాకు ఆ సహాయం ముట్టేది ముట్టనిది ఒకవేళ ముట్టితే యింత మేరకు ముట్టుతుంది ఈ విషయాలేమీ మాకు తెలియవు అని ఆయన స్పష్టంగా చెప్పారు.

బర్మా ప్రధాని థాకిన్‌నూ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూను వచ్చే నెలలో కలుసుకుంటారు. అప్పుడే కాకుండా పండిట్ నెహ్రూను ఆయన కొలంబోలో కలుసుకున్నప్పుడు గూడా మాట్లాడతారు.

అసలు తాను ఇక్కడికి ఎందుకు వచ్చిందీ వివరిస్తూ మాంగ్ ఈలా అన్నారు. ఇండియాలో బుద్ధదేవుని శిష్యులైన సారిపుత్రునియు, మొగ్గలానుని యొక్క అవశేషాలు వున్నాయి. వాటిని ఒక నెల పాటు మాకు ఎరువు ఇవ్వవలసిందని భారత ప్రభుత్వాన్ని అడగడానికి నేను ఇచ్చటికి వచ్చాను. భారత ప్రభుత్వం ఆ అవశేషాలను ఇస్తానన్నది. బర్మాప్రధాని థాకిన్ నూ ఇక్కడవచ్చి వాటిని తనతో బర్మాకు తీసుకువస్తారు.

కమ్యూనిస్టు రాజ్యాలుగాని ఇతర రాజ్యాలు ఏవీ చైనాను గుర్తించకముందే మీరు ఎందుకు గుర్తించారు. అని పత్రికా విలేఖరులు ఆయనను ప్రశ్నించారు.

గడిచిన 50 ఏండ్లుగా చైనా బందిపోటులు, వారితోపాటు బర్మా బందిపోటులు, సరిహద్దులమీదపడి దేశాన్ని కొల్లగొట్టుతున్నారు. ఇటువంటి బెడదలు సంభవించకుండా చూడాలంటే చైనా ప్రభుత్వంతో సంబంధాలు ఏర్పాటు చేసుకోవడం అత్యవసరం. లేకపోతే ఈ పీటని అరికట్టడం కష్టమౌతుంది. అందువల్లనే ఇప్పుడు మేము కమ్యూనిస్టు చైనాతో సంబంధాలు ఏర్పాటు చేసుకొన్నాం అని ఆయన సమాధానం చెప్పారు.

బర్మా ప్రజలు బానిసత్వంనుంచి విడుదలై అసాధారణ స్థితులుగా తయారైనారు. ఏది మంచి, ఏది చెడు అనేది గూడా వారు తెలుసుకోలేకుండా ఉన్నారు. బర్మా యూనియన్ చీలిపోవటానికీ, తిరిగీ ప్రజలు దాస్యానికి గురి కావటానికి పనిచేస్తున్నారు. రాజకీయవేత్తలు చేపూచీగా ప్రవర్తిస్తున్నారు.

ఇప్పటికయినా యూనియన్‌ని రక్షించిన అంశాలు మూడు ఉన్నవి. (1) యూనియన్‌పట్ల విశ్వాసం, అసక్తి పెరగటం (2) ప్రభుత్వం పట్ల విశ్వాసం గల ప్రభుత్వోద్యోగుల సేవ (3) ప్రభుత్వం అనుసరిస్తున్న ఉత్తమ రాజకీయవిధానం.

విదేశీయుల సంస్థలన్నిటినీ పరిహారం ఇవ్వకుండా జాతీయం చేయాలని మనం కోరవచ్చును. కాని అది కాలక్రమేణా అసాధ్య మవుతుంది. విదేశీయుల దోపిడీకి వంద సం॥లు గురి అయినందువల్ల విదేశీ పెట్టుబడులంటే భయం మన ప్రజలకు ఏర్పడి ఉండవచ్చును. కాని కొన్ని పరిశ్రమలకు విదేశీ పెట్టుబడులు లభించటం చాల మంచిది. అందువల్లనే కొన్ని షరతులక్రింద విదేశీ పెట్టుబడులను ఆహ్వానించటానికి నిశ్చయించుకున్నాము. ఇది కొంతమందికి ఇష్టం లేదేమోకాని, అది దేశానికి మంచిదికనుక దానిని తప్పక అనుసరిస్తాము.

మనం అన్ని దేశాలతోనూ స్నేహంగానే ఉండాలి. మనవంటి చిన్న జాతి ఎవ్వరితోనూ పోట్లాట తెచ్చుకునేటంత అహాన్ని పెట్టుకోకూడదు. ఏ దేశమయినా పరస్పరలాభం కలిగించే ప్రతిపాదన చేస్తే మనం దానిని ఆహ్వానించాలి. విదేశాలతో బేరమాడటానికి తగినబలాన్ని సంపాదించుకోవాలి. ఏ రాజకీయ విధానాన్ని అనుసరించినా అది దేశావసరాలకు తగినదని మనం గ్రహించాలి." అని నూ అందులో విజ్ఞప్తి చేశాడు.

## కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సభ

### బర్మాను ఆహ్వానించలేదా?

లండన్, డిసెంబరు 18 : వచ్చే నెల కొలంబోలో జరిగే కామన్వెల్తు విదేశాంగ మంత్రులసభకు రావలసిందిగా బర్మాను ఆహ్వానించిన విషయం తమకేమీ తెలియదని బ్రిటిష్ విదేశాంగ కార్యాలయం వారొకరు అన్నారు.

## బర్మాలో శాంతిస్థాపన

### థాకిన్‌నూ ప్రయత్నాలు

రంగూన్, డిసెంబరు 17: ఏడాదిలోపుగా శాంతి సాధించటానికి బర్మా ప్రధాని థాకిన్ నూ చేస్తున్న ప్రయత్నాలు సఫలం కాకపోవచ్చునని రంగూన్‌లోని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. బర్మాలో జరుగుతున్న రాజకీయ తిరుగుబాటులు కారణాలనూ, వాటి ఫలితాలనూ ప్రజలకు తరచుగా వివరించాలని ఆయన చేస్తున్న కృషి ఫలించి ఏడాదిలోపుగా శాంతిని సాధించటానికి అనువైన పరిస్థితులు ఏర్పడగలవని వీరు భావిస్తున్నారు.

బర్మా ప్రస్తుత పరిస్థితులను గురించి థాకిన్‌నూ ఇటీవల అతి వివరంగా ఒక సమీక్ష చేశాడు. అంత దీర్ఘంగా ఉన్నప్పటికీ చాల ముఖ్యాంశాలుండటంవల్ల పత్రికలు దీనిని రెండు భాగాలుగా రెండు రోజులు ప్రకటించినవి.

## "కర్ణాటక ఏకీకరణకు ఇది సమయంకాదు"

### భారతప్రభుత్వానికి మైసూరు శాసనసభ్యుల విజ్ఞప్తి

బెంగళూరు, డిసెంబరు 18 : కర్ణాటక ఏకీకరణమునకు యిది తరుణము కాదని నూతనముగా స్థాపితమైన మైసూరు లెజిస్లేటివ్ ఎసెంబ్లీ సభ్యులు 41 రు సమష్టిగా భారత ప్రభుత్వమువారికి విజ్ఞప్తి పంపియున్నారు.

భారత ప్రభుత్వమువారికి వారు పంపిన తంతివార్త యిట్లున్నది :

"ఈ క్రింది సంతకములు చేసిన మేము కర్ణాటక ఏకీకరణ ప్రచారము ఎంతమూరము వెళ్లినదో గుర్తించుచున్నాము, ఇట్టి కష్ట సమయములో ఈ ప్రచారము వల్ల అనర్థము కలుగను విషయమును గూడ మేము గుర్తించుచున్నాము. ఈ ఉద్యమము కన్నడిగలకు గాని, యావత్ భారతదేశమునకు గాని శ్రేయోదాయకము కాదని మేము విశ్వసించుచున్నాము. ఏది యెట్లున్నను కర్ణాటక ఏకీకరణమునకింకను సమయము రాలేదని మేము విశ్వసించుచున్నాము. మైసూరు ప్రజాప్రతినిధి సభవారు యిందు విషయమై గావించిన తీర్మానమును మేము పునఃస్థాపించుచు ఎవరు వత్తిడిచేసినప్పటికీ, ఎంత వత్తిడి చేసినప్పటికి లొంగవలదని భారత జాతీయ కాంగ్రెసు వారిని, భారత ప్రభుత్వమువారిని కోరుచున్నాము."

మొత్తం 75 మంది మైసూరు ఎసెంబ్లీ సభ్యులలో 41 గురు ఈ తంతివార్తలో సంతకములు చేసియున్నారు. మైసూరు సంస్థాన ప్రజాజీవిత జీవితములో ప్రముఖపాత్రధారులైనవారు చాలామంది యిందులో కలరు.

## భారత రిపబ్లిక్ అవతరణోత్సవాలు

### పార్లమెంటులో నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబర్, 19 : భారత రిపబ్లిక్ అవతరణ సందర్భంలో జనవరి 26, 27 తేదీలలో జరుగబోతున్న ఉత్సవ కార్యక్రమాలను గురించి, హెచ్. వి. కామత్ గారు అడిగిన ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ, ప్రధాని నెహ్రూ యీ దిగువ వివరాలు తెలియజేశారు.

జనవరి 26, 27 తేదీలు సెలవు దినాలుగా పరిగణించుతారు.

జనవరి 26 వ తేదీ ఉదయం గం. 9-30 లకు, ప్రభుత్వ భవనంలోని సభామందిరంలో రిపబ్లిక్ అధ్యక్షులు, దేశభక్తి ప్రమాణం స్వీకరించుతారు. ఆ తరుణంలో 31 ఫిరంగులు పేల్చుతారు. ప్రభుత్వ భవనంమీద అధ్యక్షుని ప్రత్యేక కేతనాన్ని యెగురవేస్తారు. అనంతరం, అధ్యక్షులు మంత్రులచేత దేశభక్తి ప్రమాణం చేయించుతారు. ఈ మహోత్సవంలో పాల్గొనటానికి, విదేశ రాయబార ప్రముఖులను, రాజ్యాంగపరిషత్ సభాసభ్యులనూ, ఇతర పౌరప్రముఖులనూ ఆహ్వానాలు పంపుతారు.

మధ్యాహ్నం అధ్యక్షుని ఊరేగింపు జరుగుతుంది. తమ స్వంత అంగరక్షకుల సిబ్బందితో అధ్యక్షులు ప్రభుత్వ భవనం వద్దనుంచి బయలుదేరుతారు, ఈ ఉత్సవం 'ఇర్విన్ స్టేడియం' వరకూ వెడుతుంది. అక్కడ అధ్యక్షులు జాతీయపతాకాన్ని ప్రతిష్ఠించుతారు. సైన్యంలోని వివిధ శాఖల దళాలు యేర్పాటుచేసే సైనికవందనాలను స్వీకరించుతారు.

ఈ ఉత్సవ కార్యక్రమంలో మంత్రివర్గంవారు సామాన్య పౌరులవరకూ అందరూ పాల్గొనడానికి సావకాశం వుంటుంది. ఆ రాత్రి ప్రభుత్వ భవనంలో, అధ్యక్షులు విందు చేస్తారు.

జనవరి 27 వ తేదీన అధ్యక్షులుచేసే మరో విందుకు పౌరప్రముఖులను వీలైనంత మందిని ఆహ్వానించుతారు.

ఈ ఉత్సవ కార్యక్రమాన్ని యేర్పాటు చేయబడిన ప్రత్యేకసంఘం, తక్కిన వివరాలను గురించి యేర్పాట్లు చేస్తుంది.

రాష్ట్రాలలోనూ, సంస్థానాలలోనూ కూడా యీరకం యేర్పాట్లు చేస్తారు. సైనిక అధికారుల సహకారం కావలసిన సందర్భాలకు, రక్షణశాఖ అవసరమైన వుత్తరువులు జారీచేస్తుంది.

నెహ్రూ ఇంకా ఇలా అన్నారు : 'ఈ కార్యక్రమం వీలైనంత గౌరవ పురస్సరంగా జరగాలనే ప్రభుత్వం అభిలషించుతున్నది. కాని ప్రస్తుత పరిస్థితిలో ఎక్కువ ఆడంబరాలకుపోయి డబ్బు ఖర్చు చేయ దల్చలేదు, అన్నారు.

నాగప్పగారు :—రిపబ్లిక్ అవతరణకు యేర్పాటుచేసిన జనవరి 26 వ తేదీ,మంచి ముహూర్తంకాదని, దక్షిణాదివారెవరైనా మీకు తెలియజేశారా ?

పండిట్ నెహ్రూ :—ప్రభుత్వం తన కార్యక్రమాన్ని నిర్ణయించుకునేటప్పుడు వినవమేషాలు లెక్క జూసుకుంటూ కూర్చోదు.

## సింగపూరులో భారతరిపబ్లిక్ ఉత్సవ ఏర్పాట్లు

సింగపూరు, డిసెంబరు 19: భారత రిపబ్లిక్ అవతరణోత్సవ సందర్భంలో జనవరి 26 వ తేదీన భారత జాతీయ పతాకాన్ని ఆవిష్కరించుకోడానికీ, భారత నాయకులచిత్రపటాలను ప్రదర్శించుకోడానికీ అనుమతి ఇవ్వవలసిందని సింగపూరులోని భారతీయ కాంగ్రెసు సభ్యులు స్థానిక పోలీసు అధికారులను కోరబోతున్నారు.

సింగపూరు ప్రభుత్వం లోగడ జారీచేసిన ఆర్డినెన్సు ప్రకారం విదేశీ పతాకాలను ఎగరవేయడానికి ప్రజలకు అధికారంలేదు.

## నవభారత రాజ్యాంగం

న్యూఢిల్లీ, డిసెంబరు 19 :—250 పేజీల ఉన్ గ్రంథంగా తయారైన నవభారత రాజ్యాంగాన్ని భారత ప్రభుత్వం అసాధారణ గెజెట్‌లో ప్రకటించింది. నవంబర్ 26 వ తేదీన రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు రాజేన్ బాబు దీనికి అధికార ముద్ర వేసి ఆమోదాన్ని తెలియజేశారు.

## మెంజిస్ ప్రధానిగా ఆస్ట్రేలియా కొత్త మంత్రివర్గం

కన్బెర్రా, డిసెంబరు 18 : ఆస్ట్రేలియా నూతనప్రధాని ఆర్. జి. మెంజిస్ తన సంకీర్ణ మంత్రివర్గసభ్యుల పేర్లను యివ్వాళ ప్రకటించాడు.

కొత్త ప్రభుత్వంలో ఖజానామంత్రి ఎ. డి. ఫాడెన్, విదేశాంగమంత్రి పి. సి. స్పెండర్, యుద్ధానంతర పునర్నిర్మాణం న ఆరిజిన్. గవర్నర్ జనరల్ మెక్‌కెల్ నూతనమంత్రివర్గంచేత పదవీ ప్రమాణం చేయిస్తారు.

## ఆంధ్ర తమిళ రాష్ట్రాల ఆస్తి అప్పుల పంపిణీ

### అసెంబ్లీలో ప్రశ్న ఆర్థికమంత్రి జవాబు

మదరాసు, డిసెంబరు 19: తమిళనాడు, ఆంధ్రదేశముల మధ్య ఆస్తి అప్పుల పంపిణీ పద్ధతిని ప్రభుత్వము నిర్ణయించలేదని ఆర్థిక మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారు నేడు అసెంబ్లీలో జనాబ్ యం. ఎ సలాంసాహెబ్ ప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

సలాం: విభజన కమిటీ నియమించబడిన దగదా కేంద్రప్రభుత్వము ఆస్తి, అప్పుల పంపిణీ గురించి వుత్తర్వులు ఏమైనా ఇచ్చినదా?

మ: ఇండియా ప్రభుత్వమువారి ఆదేశము ననుసరించి విభజన సంఘము నియమించబడెను. విభజన సంఘము శిఫార్సులు కొరకు ప్రభుత్వము ఎదురు చూచుచున్నది.

శ్రీ ఆర్. వి. స్వామి నాథన్, జనవరి 26కి ఆంధ్రరాష్ట్రము ఏర్పడుతుందేమో విభజన సంఘ సభ్యులైన మీరు తెలిపెదరా?

మ: ప్రభుత్వమునకు తెలియదు.

రజాఖాన్. తెలిని తేటలు కాంగ్రెసు వారి సాత్తేవనీ ప్రభుత్వమెందుకు భావించాలి? విభజన సంఘములో నైనా కాంగ్రెసేతరులను ఎందుకు తీసుకొనలేదు, సమాధానములేదు.

శ్రీ విశ్వనాథం: విభజన సంఘము వారి పనిపరతులు ఏమిటి?

మ: విభజన పద్ధతి నిర్ణయించలేదని జవాబు చెప్పియే యున్నాను.

హమీద్ ఖాను: విభజన సంఘము పారందరూ కాంగ్రెసువారు లేనా, లేనిచో కాంగ్రెసేతరు లెవరు?

మ: వేరే ప్రశ్న వేయవలెను.

## హిందూస్మృతి అసెంబ్లీ నిర్ణయం

(1 వ పేజీ తరువాయి)

ప్రతి నిబంధనను సేశ్వేరగా పరిశీలించుటకు ప్రభుత్వమునమ్మతించుచున్నది. సమన్వయబుద్ధితో వీలైనంతవరకు అత్యధిక సంఖ్యాకుల ఆమోదమును యీ బిల్లు విషయములో పొందవలెననియే కోరుచున్నాము.

ఈ చట్టమును పరిశీలించి నివేదికను తయారుచేసియుండి నటువంటి సెలెక్టు కమిటీ సభ్యులతోను యీ చట్టంవిషయంలో శ్రద్ధాసక్తులుగల యీ పార్లమెంటులోని సభ్యులతోను యీ పార్లమెంటు సభ్యులు కానట్టి ఇతరులతోను కలిసి యిష్టాగోష్టి సంప్రదింపులను ప్రభుత్వంజరుపదలంచియున్నది. కనుక, ప్రస్తుతం ఈ సందర్భంలో దూషణ ప్రతిదూషణలతో కూడిన వాగ్వాదమును సభలో జరిపి ఘాతుక ద్వేషములను పురికొల్పుట వాంఛనీయము కాదు.

సభాధ్యక్షులైన జి.వి. మవ్లంకరుగారు మాటాడుచు హిందూ న్యాయసూత్రములను క్రోడీకరించుట అవసరమనెడి సిద్ధాంతమును మాత్రమే సభవారిచే ఆమోదింపబడినట్లుగా ప్రస్తుతము తేటతెల్లమగుచున్నది. ఈ క్రోడీకరణ చట్టంలోని ఏ నిబంధనమైనను సవరింపబడి మార్పు చేయబడవచ్చును.

ఇష్టాగోష్టి సంప్రదింపులైన పిమ్మట, యీ క్రోడీకరణచట్టము ఈ పార్లమెంటు సభయొక్క రాబోవు సమావేశమునందు తిరిగి చర్చకు రాగలదని, పండిట్ నెహ్రూ గారు చెప్పిరి.

## మరనాగళ్లతో వ్యవసాయం

(1-వ పేజీ తరువాయి)

డోజర్లూ" కొన్నాం. ఇందు క్రిం.ద రు. 258,20,985 లు ఖర్చు చేశాం.

వీటిలో కేంద్రప్రభుత్వం 221 ట్రాక్టర్లూ, 12 బుల్‌డోజర్లూ, కొన్నది. వీటి నన్నిటినీ మొత్తంగా కొనగోలు చేశాం. అందుచేత దేనికది ప్రత్యేకంగాయెంతెంత ఖరీదైందీ తేలదు. వీటిలో 22 ట్రాక్టర్లు మరమ్మత్తు చేయటానికి కూడా పనికి రాకుండా చెడిపోయినై. అందుచేత వీటిని విప్పించి, వీటి భాగాలను, ఇతర వాటి మరమ్మత్తులో కావలసిన అదనపు భాగాల క్రింద ఉపయోగించడానికి యేర్పాటు చేశాం.

"ఈ యంత్రాల ద్వారా, గడచిన సంవత్సరం, 3,77,164 ఎకరాలు సాగు చేయించాం 1949-50లో 5,17,917 ఎకరాలు సాగైంది, మొట వేసుకున్న అంచనా ప్రకారం 5,78,100 ఎకరాలు సాగు కావలసి వుంది.

"ఈ యంత్రాలను తెప్పించటంలో, చెయమితి పన్ను రద్దు చేశాం. రాష్ట్రాలలో సంస్థానాలలోనూ కూడా, యీ యంత్రాలను తక్కువకేటుకు అద్దెకిచ్చాం. సప్లైడీలర్లు ద్వారా నికూడా వైతులకు అద్దెకిచ్చాం. కొన్ని రాష్ట్రాలలో యాంత్రిక వ్యవసాయానికి ఋణాలు కూడా యిచ్చాం" అని తెలియజేశారు.

# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 21 బుధవారం

## మద్రాసు (ఎ)

ఉ॥ 7-30 ఆర్. శ్యామలాదేవి వీణ. 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం (రి). 8-30 హిందీపాఠము. 8-50 మద్రాసు (బి) వలె. మ॥ 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమాసంగీతం (రి). 4-30 పాశ్చాత్యసంగీతం (రి) సా॥ 5-30 కె. వి. సరోజ పాట. 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 శారదా రాజభూషణం పాట. 7-0 ఎస్. కళ్యాణరామన్ పాట. 7-30 ఎద్వర్డుపాల్ సితార్. 8-0 మదరాసు (బి) వలె. 8-30 మవక్కాల్ ఎన్. రంగరాజన్ పాట. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 వయొలిన్ నీలయవిద్యాం కుడు. 9-30 మదరాసు (బి) వలె. 10-0 గాత్రసంగీతం (రి).

## మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగునవార్తలు. 7-15 ఎస్. వి. పార్థసారథి రికార్డులు. 7-45 మదరాసు (ఎ) వలె. 8-30 హిందీపాఠము 8-50 శాంత పాట. మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం, 12-30 మాధ్యమికపాఠశాల విద్యార్థులకు. యుద్ధములు. ముట్టడులు. అర్కాటుముట్టడి ప్రసంగం. రామచంద్రుని వెంకటప్ప, వ్యాయామపాఠములు కె. ఎస్. రావు పాఠశాల దినచర్య. 1-30 మదరాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నతపాఠశాల విద్యార్థులకు విద్యుదుత్పత్తి విధానములు రసాయన మూలమున ప్రసంగం జె లక్ష్మీనారాయణ మూడభోవుట రోబర్ట్ క్రైవ్. రూపకము. ఎస్. కె. పి. డి. ఉన్నత పాఠశాల. 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. లేఖారచన సారస్వత లేఖలు-ప్రసంగం. జి. రామశాస్త్రి డామన్‌పిథియస్. నాటకము సంగీత వాద్యములు సా॥5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం. (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం. కొండ జాతులు చెంచులు. ప్రభుత్వ అటవీశాఖ వారి ప్రసంగం. కోయదోరపాట. జానపదగీతి. 7 తెలుగున వార్తలు. 7-15 ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు. గోష్ఠిగానము. 8-0 విజయవిధాతసంగీతరూపకము. శ్రీనోడ్నిపస్తునుండి రచన రజని 8-30 మద్రాసు (ఎ) వలె. 9-30 వి. ఎస్. సోమసుందరం 10 మద్రాసు (ఎ) వలె.

## విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు, 7-15 ఎం. ఎస్. సుబ్బలక్ష్మి రికార్డులు. 7-30 డి. పార్వతి పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 గీతావళి. జి. భావనారాయణ 8-30 హిందీ పాఠము, 8-50 ద్వి భాష్యం నారాయణశర్మ వయొలిన్. మ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1 తారాపథం (రి). 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా 5-30 ద్విభాష్యం నారాయణశర్మ వయొలిన్. 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతావళి, జి. భా. నారాయణ 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7 తెలుగున వార్తలు. 7-30 చిత్రవాణి (రి) 7-45 కాలచక్రము అంతర్జాతీయ సమస్యా సమీక్ష డి. వి. కృష్ణ, 8-0 క. పి. నారాయణరావు, వీణ. 8-30 డి. పార్వతి, పాట. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 చిత్రవాణి (రి). 9-30 క. పి. నారాయణరావు, వీణ.

## హైద్రాబాదు

ఉ. 7-30 షెహనాయ్ రికార్డులు. 7-40 మహమ్మద్ వజీర్, డాక్టర్ ఘజల్ 8-0 ఆంగ్లమున వార్తలు 8-20 వి. భాగ్యలక్ష్మి, కర్నాటక సంగీతం 8-50 తెలుగున వార్తలు, 9-15 లక్ష్మీబాయ్ బరోడ్కార్, ఖయాల్ దేశ్కార్, మ. 12-30 రికార్డులు 1 తారాపథం (రి). 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) సా. 5 లక్ష్మీబాయ్ బరోడ్కార్ శాస్త్రీయ సంగీతం. 5-25 మహమ్మద్ వజీర్, డాక్టర్ గీత్ 6-30 గ్రామస్థుల కార్యక్రమం. తెలుగున సమష్టి కుటుంబ విధానం. ప్రసంగం అప్పపదులు జె. రామకోటేశ్వరరావు, భూతవైద్యం. హాస్యరచన 7 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 7-15 ఎంకి పాటలు ఎం. వెంకటప్పరాజు, 7-40 ఆంగ్ల ప్రసంగం. 7-50 గీత్ రికార్డులు, 8-30 లక్ష్మీబాయ్ బరోడ్కార్, ఖయాల్ శంకర 9 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 9-15 లక్ష్మీబాయ్ బరోడ్కార్ 9-55 శ్రోతలు కోరిన రికార్డులు.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 17:

మార్చి 30.56/30 57 కీ 30.88/30.38 జూలై 29.79/29 79 అక్టోబర్ 28 33/28.34 డిసెంబరు 28.22/28 24 మార్చి 28.13/బిడ్ 28.14అస్క్డ్ మే 28.07బిడ్ 28 08అస్క్డ్.

| | | |
|---|---|---|
| ఇండింగ్ | హాజరు | 31 25 |
| మార్చి | (గరిష్ఠధర) | 30.67 |
| | (కనిష్ఠధర) | 30.49 |

# "ఇండియాతో కాశ్మీర్ చేరిక క్రమబద్ధమైనది"

## పాకిస్థాన్ వితండవాదానికి ఇండియా ప్రభుత్వ సమాధానం

న్యూఢిల్లీ, డిసెంబరు 18: కాశ్మీరు సంస్థానం ఇండియాతో చేరడం అక్రమమంటూ పాకిస్థాను ప్రభుత్వ కాశ్మీరు వ్యవహారాల మంత్రి నవాబు గుర్మానీ 1949 అక్టోబరు 1 న కాశ్మీరు కమిషనుకు వ్రాసిన లేఖలోని వాదనలను ఖండిస్తూ, నవంబరు 21 న ఇండియా ఇండియా ప్రభుత్వ విదేశ వ్యవహారశాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిరిజా శంకర బాజ్‌పాయి కాశ్మీర్ కమిషనుకు వ్రాసిన లేఖను నేడు ఇండియా ప్రభుత్వం ప్రచురించింది.

కాశ్మీరు సంస్థానం ఇండియాలో చేరడంగురించీ, భారత రాజ్యాంగ పరిషత్తులో కాశ్మీరుకు ప్రాతినిధ్యం ఇవ్వడం గురించీ సర్ గిరిజాశంకరు ఈ విధంగా వ్రాశారు:

"కాశ్మీరు సంస్థాన ప్రజలు మరోలాగు నిర్ణయించేవరకు ఆ సంస్థానం క్రమబద్ధంగా ఇండియాలో చేరిఉంటుంది. ఇండియా రాజ్యాంగరచన జరుగుతూ ఉండగా కాశ్మీరు సంస్థాన ప్రతినిధులకు అందులో పాల్గొనే అవకాశం ఇవ్వడం ధర్మం. కాని ఇంతమాత్రాన ఇండియా ప్రభుత్వం కాశ్మీరు ప్రజలుచేసే స్వతంత్ర నిర్ణయాన్ని పాటించడానికి అభ్యంతరం ఉండదు.

"కాశ్మీరు పాకిస్థానులమధ్య జరిగిన యథాతథపు ఒడంబడిక సుంకాలూ, రాకపోకలూ, తంతి తపాలాలూ, సివిల్ సప్లయిలు మొదలైన వాటికి సంబంధించి ఉన్నదిగాని అందులో విదేశ వ్యవహారాల రక్షణ సమస్యల ప్రసక్తిలేదు. యథాతథపు ఒడంబడిక జరుపుకుందామని పాకిస్థానును అడిగిననాడే కాశ్మీరు ఇండియానుకూడా అటువంటి ఒడంబడిక జరుపుకుందామని అడిగింది. అందుచేత అటువంటి ఒడంబడికలో విదేశవ్యవహారాలకూ, రక్షణలకూ తావులేదని తెలుస్తున్నది.

"దాడికి గురి అయిన సంస్థానాన్ని రక్షించుకోడానికి గాను సహాయం అడుగుతూ, అటువంటి సహాయం సక్రమంగా ఉండగలందులకై కాశ్మీరు రాజు సంస్థానాన్ని ఇండియాలో చేర్చడానికి అర్హుడు కాడనడం అర్థంలేని మాట. దౌర్జన్యంతోనూ వంచనతోనూ కాశ్మీరు ఇండియాలో చేర్చబడిందనడానికి ఆధారం లేదు. కాశ్మీరు ప్రజలకు ప్రాతినిధ్యం వహించే జాతీయ పరిషత్తుకు నాయకుడైన షేక్ అబ్దుల్లా కాశ్మీరు చేరికను బలపరిచాడు. తమపై జరిగిన దాడిని కాశ్మీరు ప్రజాబాహుళ్యం నిరోధించింది. కనుక వారు కూడా కాశ్మీరు రాజుపక్షమే ఉన్నారు."

### పాకిస్థాను వాదం

పాకిస్థాను ప్రభుత్వ కాశ్మీరు వ్యవహారాల మంత్రి నాలుగు అంశాలు చెప్పారు: (1) కాశ్మీరు పాకిస్థానుతో యథాతథపు ఒడంబడిక చేసుకొని ఉండడంవల్ల ఇండియాతో ఒడంబడిక చేసుకొనడానికి హక్కులేదు, (2) కాశ్మీరును ఇండియాలో చేర్చడానికి కాశ్మీరు మహారాజుకు అధికారంలేదు, (3) హింసాయుతంగానూ, వంచనతోనూ కాశ్మీరు చేరిక జరిగింది కనక అది క్రమబద్ధం కాదు, (4) ఇండియాలో చేరేటప్పుడు కాశ్మీరు మహారాజు వరకు ఒకటి ప్రతిపాదించాడు కనుక చేరిక చెల్లదు.

ఈ అభ్యంతరాలకు ఇండియా ప్రభుత్వం యీ విధంగా సమాధానం చెబుతున్నది:

1947 ఇండియా స్వాతంత్ర్య చట్టం అములులోకి రాకపూర్వం భారత సంస్థానాలు బ్రిటిషు ఆధిపత్యంకింద ఉండినవి. 1935 భారత చట్టం ప్రకారం ఈ సంస్థానాల విదేశ వ్యవహారాలూ రక్షణలూ బ్రిటిష్ రాజప్రతినిధే చూసేవాడు. ఇంతేకాక సుంకాలు, రవాణాలు, రాకపోకలు, తంతి తపాలాలు, నాణాలు, సివిలు సప్లయిలు మొదలైన అనేక అంశాలపైన సంస్థానాలు కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలతో ఒడంబడికలు జరుపుకొని ఉండేవి. యీ వ్యవహారాలకు బాధ్యుడు గవర్నరు జనరలు. అయితే రాజప్రతినిధిగానూ, గవర్నరు జనరలుగానూ ఒక వ్యక్తి వ్యవహరించడంచేత సామరస్యం సాధ్యమై ఉండేది.

1947 ఇండియా స్వాతంత్ర్యచట్టం అములులోకి రాగానే సంస్థానాలకు బ్రిటిషువారితో గల సంబంధాలూ, బ్రిటిషువారి ఆధిపత్యమూ తొలగిపోయినవి. కాని గవర్నరుజనరలుతో గల ఒడంబడికలు మిగిలిపోయినవి. వీటినుండి సంస్థానాలకు విముక్తి లభించలేదు. ఈ ఒడంబడికలను ఏ పక్షం వారుగాని రద్దు చేసేవరకూ, లేదా వీటిస్థానే కొత్త ఒడంబడికలు జరిగేవరకూ ఇవి అములులో ఉంచేటట్టు 1947 ఇండియా స్వాతంత్ర్య చట్టంలో ఉల్లేఖించబడింది.

ఇటువంటి ఒడంబడికలను కాశ్మీరు ప్రభుత్వంవారు అవిభక్త ఇండియా ప్రభుత్వంతోనూ, అవిభక్త పంజాబురాష్ట్ర ప్రభుత్వంతోనూ చేసుకొని ఉన్నారు. ఈ ఒడంబడికలనుగురించి యథాతథపు ఒడంబడిక చేసుకొందామని జమ్మూ కాశ్మీరు ప్రధాని పాకిస్థాను ప్రభుత్వానికి 1947 ఆగస్టు 12 న తంతి పంపాడు. ఆగస్టు 16 న పాకిస్థాను ప్రభుత్వంవారు యథాతథపు ఒడంబడిక జరపడానికి ఒప్పుకున్నారు. పూర్వపు ఇండియా ప్రభుత్వంతో కాశ్మీరు చేసుకొని ఉన్న ఒడంబడికలకు మాత్రమే ఇది వర్తిస్తుంది. దీనికి విదేశ వ్యవహారాలతోగాని రక్షణతోగాని ఎట్టి ప్రమేయంలేదు.

### జఫ్రుల్లాఖాన్ సాక్ష్యంలో చెప్పిన విషయం

కాశ్మీరు సమస్యను గురించి ఇండియా ప్రభుత్వం భద్రతామండలికి ఫిర్యాదుచేసిన సందర్భంలో పాకిస్థాను పక్షాన సర్ మహమ్మదు జఫ్రుల్లా ఖాను ఇచ్చిన సమాధానంలో ఈ విధంగా ఉన్నది:— "1947 ఆగస్టు 15 న కాశ్మీరు సంస్థానం, ఇతర సంస్థానాలలాగే, ఇండియాతోగాని పాకిస్థానుతోగాని చేరడానికి, మానడానికీ హక్కుగలిగి ఉండింది. పాకిస్థానుతో కాశ్మీరు చేసుకొన్న యథాతథపు ఒడంబడిక ఫలితంగా కాశ్మీర్ యొక్క తంతి తపాలాశాఖ పాకిస్థానుపరం చేయబడింది."

1948 జనవరి 17 న సర్ జఫ్రుల్లా భద్రతా మండలిలో మాట్లాడుతూ 'యథాతథపు ఒడంబడికలను గురించి నిన్న చెప్పి ఉన్నాను. రాకపోకలు, సప్లయిలు, తంతి తపాలా వీర్పాటులను గురించి కాశ్మీరు పాకిస్థానుతో యథాతథపు ఒడంబడిక చేసుకొన్నది.'

1948 జనవరి లగాయతు ఏప్రిలు వరకూ భద్రతామండలిలో కాశ్మీరునుగురించి సుదీర్ఘమైనచర్చలు జరిగిఉన్నప్పటికీయథాతథపు ఒడంబడిక విదేశ వ్యవహారాలను గురించీ, రక్షణలను గురించీ జరిగిందని ఎక్కడా చెప్పబడలేదు. కాశ్మీరుకు ఇండియాతో చేరే అధికారం లేదన్న క్రొత్తవాదం నిరాధారమైనది.

అదీకాక కాశ్మీరు ప్రభుత్వం పాకిస్థానును కోరిననాడే ఇండియా ప్రభుత్వాన్నికూడా యథాతథపు ఒడంబడికలు చేసుకోమని కోరింది. ఈ విషయం మాట్లాడడానికి కాశ్మీరు ప్రభుత్వ ప్రతినిధిని ఢిల్లీకి పంపమని ఇండియా ప్రభుత్వం వారన్నారు. కాని కాశ్మీరు ప్రభుత్వోద్యోగులలో మార్పులు జరగడంచేత ఇది సాగలేదు. సంస్థానంయొక్క విదేశ వ్యవహారాలకూ, రక్షణకూ సంబంధించిన ఒడంబడికలను ఒకేసారిగా రెండు దేశాలతో చేసుకొనడానికి కాశ్మీరు ప్రయత్నించి ఉండడం అసంభావ్యం.

### కాశ్మీరు చేరికకు పూర్వం

కొంతకాలంపాటు ఆదివరకుఅములులో ఉన్న ఒడంబడికలను పాటించడానికి ఒప్పుకొని కాశ్మీరుతో యథాతథపు ఒడంబడిక చేసుకున్న పాకిస్థాను ఈ ఒడంబడికను ఉల్లంఘించి కాశ్మీరుపై ఆర్థిక దిగ్బంధన అములు జరిపింది. తరువాత కాశ్మీరుపై దాడి ముఠాలను ఉసికొల్పింది. ఈ దాడిలో పాల్గొన్న పాకిస్థాను సైనికులు సెలవుమీద ఉన్నారనీ, కాశ్మీరు పశ్చిమ ప్రాంతానికి, పూంఛికి, చెందినవారనీ పాకిస్థాను సమర్థించవలసి వచ్చింది. దాడి చేసిన హంతకులు కాశ్మీరు లోయలోని ప్రజలపట్ల రాక్షసులవలె ప్రవర్తించారు.

గుర్మానీ చెప్పినట్లు యథాతథపు ఒడంబడిక విదేశ వ్యవహారాలకూ, రక్షణకూ సంబంధించే ఉండినట్టయితే ఇండియా అటువంటి ఒడంబడిక చేసుకొన్న పక్షంలో, పాకిస్థాను ఆరోపించినట్లు, ఇండియా బలంతోనూ, వంచనతోనూ కాశ్మీరును చేర్చుకో నవసరం ఉండేదికాదు. కాని ఆ వాదన అపసవ్యమైనది. కొద్ది వ్యవధిలో, దాడి ముఠాల దౌష్ట్యాన్ని నిరోధించడానికి మాత్రమే ఇండియా కాశ్మీరుకు సైన్యాలను పంపవలసి వచ్చింది. ఇండియా ఈ పనిచేయనిపక్షాన కాశ్మీరుపరిస్థితి విషమించి ఇండియా, పాకిస్థానులమధ్యయుద్ధం తప్పకపోయేది.

కాశ్మీరును చేర్చుకొనడానికి దౌర్జన్యమూ వంచనా అవలంబించినది పాకిస్థాను. కాశ్మీరుపై దాడిలో తానునిర్వహించిన పాత్రను సమర్థించడానికి పాకిస్థాను చెప్పే విషయాలను వంచనఅనే అనాలి.

కాశ్మీరును శత్రువులనుండి రక్షించుకొనడానికిగాను సహాయంపొందడానికి కాశ్మీరు మహారాజా ఇండియాతో చేరవలసివచ్చింది. కాశ్మీరు ప్రజాసంస్థలన్నిటిలోకీ పెద్దదైన జాతీయమహాసభకు నాయకుడైన షేక్ అబ్దుల్లా చేరికకు అనుమతించాడు. సంస్థానప్రజలు దాడిముఠాలను శక్తివంచనలేకుండా ప్రతిఘటించారు. కనుక కాశ్మీరుప్రజలు అనేకసభ్యాకులు చేరికకు సుముఖులు.

కాశ్మీరుప్రజలు అత్యధికసంఖ్యాకులు పాకిస్థానుతో చేరగోరుతున్నారని గుర్మానీ వాదం. కాశ్మీరు ప్రజాభిప్రాయం ఇంకా తెలియవలసి ఉన్నదికాని 1947 అక్టోబరులో దాడి ముఠాలు శ్రీనగరు సమీపించినప్పుడు అక్కడి ప్రజలందరూ, నిరాయుధులై కూడా, శత్రువును ప్రతిఘటించి ఉండడం గమనించదగినది. ఆ ప్రజలలో ఏ కొద్దిమంది పాకిస్థానుకు సుముఖులై ఉన్నా విమానకేంద్రాన్ని విధ్వంసంచేసి భారతీయ సైన్యాలు సహాయపడడం అసాధ్యం చేసి ఉండేవారే.

కాశ్మీరుచేరిక షరతులతో కూడుకొన్నదన్నవాదం గురించి భద్రతామండలిలో మాట్లాడుతూ, ఈ చేరిక తాత్కాలికమైనది కాదనీ, సమగ్రమైనదనీ, ఇండియా ప్రభుత్వాన్ని బంధించేదనీ, జనవాక్య నిర్ధారణ జరపాలన్న కోరిక చేరిక ఒడంబడికవెంట ప్రత్యేకలేఖలో తెలుపబడిందనీ చెప్పారు. 1947 అక్టోబరు 26 నుంచీ కాశ్మీరుచేరిక అములులోకి వచ్చింది. ఒకసారి చేరిన సంస్థానం అధినేతయొక్క అనుమతి లేకుండా విడిపోవడానికి వీలులేదు. కాని సంస్థానాల చేరికవిషయంలో ప్రజాభిమతాన్ని పాటించడానికి ఇండియాప్రభుత్వం నిర్ణయించి ఉండడం వల్ల, కాశ్మీరులో జనవాక్య నిర్ధారణ జరపడానికి ఇండియా ప్రభుత్వం ఒప్పుకొన్నది.

1949 ఏప్రిలు 21 న భద్రతా మండలి వారు చేసిన తీర్మానంయొక్క ప్రస్తావికలో ఈకింది మాటలున్నవి: "కాశ్మీరు ఇండియాతో చేరాలా, పాకిస్థానుతో చేరాలా అన్నది జనవాక్యం ద్వారా నిర్ధారణ కావాలని ఇండియా, పాకిస్థానులు రెండూ ఒప్పుకొన్నందుకు భద్రతా మండలివారు హర్షిస్తున్నారు." ఈమాటలనుబట్టి కాశ్మీరు ఇండియాతో చేరేదీ పాకిస్థానుతో చేరేదీ ఇంకా నిర్ణయంకాలేదని గుర్మానీ భాష్యం చెప్పయత్నించాడు.

కాని ఇది అక్రమం. జమ్మూ కాశ్మీరు ఇండియాలో కలవడం క్రమబద్ధం కాదని భద్రతామండలిగాని, కాశ్మీరు కమిషనుగాని భావించలేదు. కాశ్మీరు ఇండియాతో చేరివున్నా, మానినా, లేదా పాకిస్థానుతో చేరవలచినా జనవాక్య నిర్ధారణ విధానం మంచిదని మాత్రమే భద్రతామండలివారి తీర్మాన ప్రస్తావన చెబుతున్నది.

### రాజ్యాంగపరిషత్తులో కాశ్మీరు ప్రతినిధులు

కాశ్మీరుప్రజలుమరోలాగునిర్ణయించేదాకా ఆ సంస్థానం ఇండియాతో చేరి ఉంటుంది. అటువంటప్పుడు ఆ సంస్థాన ప్రతినిధులకు రాజ్యాంగ రచనలో పాల్గొనే అవకాశం ఇవ్వడం భావ్యం. సంస్థానంలో శాంతిపరిస్థితులు ఏర్పడి, జనవాక్య నిర్ధారణ జరిగి, కాశ్మీరు ప్రజలు ఇండియాతో చేరరాదని నిర్ణయించే పక్షాన పార్లమెంటులో కాశ్మీరుకు ప్రాతినిధ్యం అంతమవుతుంది. రాజ్యాంగంలో కాశ్మీరుకు సంబంధించిన నియమావళి రద్దవుతుంది.

ఏప్రిలు 1949లో కమిషను వారు శాంతి ప్రతిపాదనలు చేసిన తరువాతనే ఇండియా ప్రభుత్వంవారు, ఆజాద్ కాశ్మీరు సేనలు రద్దయితే గాని భారతీయ సైన్యాలను ఉపసంహరించమనే వైఖరి అవలంబించినట్లు కనిపిస్తున్నదని గుర్మానీ అన్నాడు. ఈ విషయం నిజమేమిటో కాశ్మీరు కమిషనుకు తెలుసు. వారు ఇండియా ప్రభుత్వంతో చాల ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి ఉన్నారు. కమిషనువారు 1948 ఆగస్టు 13న, 1949 జనవరి 5న చేసిన తీర్మానాలపై ఇండియా ప్రభుత్వం యొక్క వైఖరి ఇండియా ప్రభుత్వం వారి లేఖలకూ, కమిషనుతో చేసిన చర్చలకూ సంబంధించిన రికార్డులలో నష్టాడై ఉన్నది.

1948 ఆగస్టు 13 తీర్మానాన్ని ఆమోదిస్తూ ఇండియా ప్రభుత్వం వారు సంస్థాన భద్రతను కాపాడే బాధ్యత తమపై ఉన్న విషయం విస్పష్టం చేసి ఉన్నారు. జనవరి 5 తీర్మానం పై ఇంకా చర్చ జరుగుతూ ఉండగానే భారత ప్రధాని 1948 డిసెంబరులో డా. గ్రాహాంకు లేఖ వ్రాస్తూ, ఆజాద్ సైన్యాలను రద్దు చేయవలసి ఉంటుందన్నారు. అవి రద్దుగాని పక్షంలో కాశ్మీరు భద్రతకు క్షేమం లేక పోవడమే కాక, జనవరి 5 తీర్మానం ప్రకారం ఆజాద్ కాశ్మీరు ప్రాంతం నుంచి పారి పోయిన స్త్రీప్రజలు తిరిగివచ్చి నిస్సంకోచంగా జనవాక్య నిర్ధారణలో పాల్గొనే అవకాశం ఉండదు. ఏమంటే, ఆజాద్ సైన్యాల బలం 32 బెటాలియనులకు పెరిగిందనీ ఆ సైన్యాలు పాకిస్థాను సైనికాధికారుల కింద పనిచేస్తున్నవనీ 1949 ఫిబ్రవరిలో పాకిస్థాను వారే ఒప్పుకొన్నారు. ఈ కారణంచేత ఆజాద్ కాశ్మీరు సేనలు రద్దుకావాలనడంలో ఇండియా క్రొత్త వరతు ప్రతిపాదించి ఆగస్టు 13 తీర్మానాన్ని వ్యతిరేకించిందన్నమాట నిజం కాదు. తనపై కాశ్మీరు రక్షణ బాధ్యత ఉన్నమాట ఇండియా ఆ తీర్మానాన్ని ఆమోదించే టప్పుడే తెలిపింది.

యుద్ధ విరమణ జరిగినది లగాయతు జనవాక్య నిర్ధారణ జరిగే వరకూ గల మధ్యకాలం సంధి కనుక ఆజాద్ కాశ్మీర్ ప్రాంతానికి అక్కడి ప్రజలు తిరిగి వచ్చే పరిస్థితి ఏర్పడాలంటే జనవాక్య నిర్ధారణ ఇంకా కొంతకాలం ఉండగానే ఆజాద్ కాశ్మీరు సైన్యాలు రద్దుకావలసి ఉంటుంది. ఈప్రయత్నాలు భారత సైన్యాలు కాశ్మీరులో ఉండగానే జరగాలి.

### ఉత్తర ప్రాంతాలు

ఆగస్టు 13 తీర్మానంలో కాశ్మీరు కమిషనువారు ఆజాద్ కాశ్మీర్ ప్రాంతాన్ని గురించి వివరించిన విషయాలే సంస్థానం యొక్క ఉత్తరాన గల కొండ ప్రాంతంయొక్క పరిపాలనా రక్షణలకు వర్తించాలని గుర్మానీ వాదం.

ఇది అసత్యమని, 1948 ఆగస్టు 20 న భారత ప్రధాని వ్రాసిన లేఖకు ఆగస్టు 25 న వ్రాసిన సమాధానం విశదం చేస్తున్నది. "మీరు తెలిపిన విషయం గురించి తీర్మానాన్ని అములుజరిపేటప్పుడు విచారించగలం." అని కోర్పెల్ భారత ప్రధానికి వ్రాశాడు. అంతేగాని గుర్మానీ తెలిపినట్లు, "ఉత్తర ప్రాంతంలోకి ఇండియా సేనలుగాని, కాశ్మీరు సేనలుగాని ప్రవేశించడానికి వీలులేదు." అని ఉండలేదు.

ఆగస్టు 13 తీర్మానం 1948 ఆగస్టులోని పరిస్థితులకు కాక, ఈ నాటి పరిస్థితులకు వర్తింపు చేయబడిందని కమిషను వారి అభిప్రాయమైనట్లు పాకిస్థాను ప్రభుత్వం భావిస్తున్నది! ఆజాద్ కాశ్మీరు సేనల రద్దుగురించీ, ఉత్తర ప్రాంతాలను గురించీ గుర్మానీ చెప్పేమాటలు పాకిస్థాను ప్రభుత్వంవారి భావనను బలపరుస్తున్నవి. ఈ వైఖరిని ఇండియా ప్రభుత్వం ఆమోదించడంలేదు కనుక వారు తమ బాధ్యతలకు స్వస్తి చెబుతున్నారనడం ఆధార రహితం.

తాముచేసిన ఒప్పందాలన్నిటినీ ఇండియా ప్రభుత్వం నెరవేర్చ సిద్ధంగా ఉన్నది. అయితే ఉన్న పరిస్థితులకు అనుగుణంగా ఒప్పందాలు పాలించటమే విధానాని, నిరాధారమైన వాదనలకు అనుగుణంగా కాదు.

# కాశ్మీర్ సమస్యాపరిష్కారానికి భద్రతామండలి అధ్యక్షుని కృషి

## భారత-పాకిస్థాన్ ప్రతినిధులతో మెక్‌నాటన్ సంప్రతింపులు ప్రారంభం

న్యూయార్కు, డిసెంబరు 18: కాశ్మీరు తగాదా విషయంలో నిన్న భద్రతామండలి చేసిన నిర్ణయాన్ని అమలు జరిపేందుకు మండలి అధ్యక్షుడు మెక్ నాటన్ క్షణం వృథాపోనివ్వకుండా కృషి చేస్తున్నాడని పి. టి. ఐ. విలేఖరి వ్రాస్తున్నాడు.

కాశ్మీరు సమస్యా పరిష్కారం విషయంలో, ఉభయులకు అంగీకార యోగ్యంగా ఉండే ప్రాతిపదిక సాధించేందుకు, ఇండియా పాకిస్థాన్ ప్రతినిధులతో సంప్రదింపులు జరిపే నిమిత్తం, మండలి అధ్యక్షుడైన మెక్‌నాటన్‌ను భద్రతామండలి నిన్న నియోగించింది. భద్రతామండలి సమావేశం వాయిదా పడిన మరుక్షణమే జనరల్ మెక్‌నాటన్ ముందువారం సంప్రదింపులు యే పద్ధతిలో జరపాలన్న విషయమై పాకిస్థాన్ విదేశాంగ మంత్రియైన జఫ్రుల్లా ఖాన్‌తో మాట్లాడాడు.

ఇవ్వాళ ఆదివారం శలవురోజైనా, మెక్‌నాటన్ సిబ్బంది కెనడా ప్రతినిధివర్గ కార్యాలయంలో, సంప్రదింపులు ప్రారంభమైనప్పుడు కావలసిన పత్రాలు అవీ తయారుచేస్తున్నది.

ఇండియా, పాకిస్థాన్ ప్రతినిధులతో, జనరల్ మెక్‌నాటన్‌సంప్రదింపులు, న్యూయార్కులో ఆయన కార్యాలయంలో ప్రారంభమవుతవి.

రేపు, భారతప్రతినిధివర్గ నాయకులు, సర్ బెనెగల్ నరసింగరావుగారు, గిరిజాశంకర్ బాజ్‌పాయ్, షేక్ అబ్దుల్లా గారలు మెక్‌నాటన్‌ను కలుసుకొంటారు.

నిన్న భద్రతా మండలి నిర్ణయానికి పూర్వంకూడా, మండలి అధ్యక్షునివద్దకు ఉభయ ప్రతినిధివర్గాల రాకపోకలు జరిగినప్పటికీ, అవి అసలు సంప్రదింపులకు అవసరమైన సద్భావాన్ని సాధించే నిమిత్తమేనని తెలుస్తున్నది. ఇంతవరకు, ప్రధాన సమస్యలేవీ చర్చించబడనేలేదు.

కాశ్మీర్ సమస్యపై భద్రతామండలి చర్చధోరణి చూస్తున్నవారు, కాశ్మీర్ సమస్యపై మండలిలోని సోవియట్ ప్రతినిధి, ఎక్కువ శ్రద్ధచూపడం యిదే ప్రథమమని అన్నారు. మండలిలో నిన్న నార్వే ప్రతిపాదన చర్చింపబడుచున్న సమయంలో, సోవియట్ ప్రతినిధి మాట్లాడుతూ, తమ తమ వాదములను తెలుపుకొనుటకు ఇండియా పాకిస్థాన్ ప్రతినిధులకు అవకాశమివ్వాలని "ఇది మామూలు వ్యవహారానికి సంబంధించిన విషయం కానే కాదని" అన్నాడు. అధ్యక్షుడు తన ఉద్దేశ్యాన్ని సోవియట్ ప్రతినిధి సారాప్కిన్ సవాలుచేస్తున్నాడని తెలుసుకోగానే నార్వే తీర్మానాన్ని ఓటింగ్‌కు పెట్టాడు. సారాప్కిన్ ఓటింగ్‌లో పాల్గొనలేదు.

వచ్చేవారం మండలి అధ్యక్షుడు ఇండియా, పాకిస్థాన్ ప్రతినిధులతో చర్చించే సమస్యలన్నింటిలో, ఆజాద్ కాశ్మీర్ సేనల, ఉద్వాసన సమస్య అతిజటిల సమస్య కాగలదని తెలుస్తున్నది. ఈ సమస్య అసలు ప్రధానమైన 'సైనికోప సంహార' సమస్యతో ముడిపడిఉన్నది.

ఇండియా ఆజాద్ కాశ్మీర్ సేనలను గుర్తించదని,ముందువాటికి ఉద్వాసనచెప్పాలని పట్టుబడుతున్నదని కాశ్మీర్ కమిషన్ తనని వేదికలో వ్రాసింది.

పాకిస్థాన్ ఆజాద్ కాశ్మీర్ సేనల సమస్యను, ఆగస్టు 13 తీర్మానం అములు జరిపేసందర్భంలో ఆఖరిఘట్టంలో ఆలోచించవచ్చునని పాకిస్థాన్ వాదం.

కాశ్మీర్ సంస్థానాన్ని పాకిస్థాన్‌లో చేరేటట్లుచేయడమే, ఆజాద్ కాశ్మీర్ వారిలక్ష్యమని, ఆజాద్ కాశ్మీర్ సైన్యంలో పాకిస్థాన్ సైన్యాలుకూడా కొన్నికలిసి పనిచేస్తున్నాయని, వీటి సంఖ్య 32 దళములని, పాకిస్థాన్‌సైన్యము సహితం మిలిటరిపరిస్థితిని తారుమారు చేయగలిబలం వీటికిఉన్నదని నివేదికలో ఇచ్చితంగా వ్రాసింది.

కాబట్టి, కాశ్మీర్ నుంచిసైన్యాల ఉపసంహారంకంటే, ముందు, పాకిస్థాన్ సేనలన్నీ పూర్తిగా కాశ్మీర్‌నుంచి వైదొలగడంముఖ్యమని, ఇండియావాదం.

ప్రస్తుతస్థితినిబట్టి చూస్తే, ఉభయపక్షాలలో యేదీ తనపట్టుదలను యేమాత్రమూ వదలేటట్లు కనిపించడంలేదు. ఏమైనా జనరల్ మెక్‌నాటన్ ఆజాద్ కాశ్మీర్ సేనలసమస్యతోనే, ఉభయపక్షాల ప్రతినిధులతోను సంప్రదింపులు ప్రారంభిస్తాడని యిక్కడ అనుకొంటున్నారు.

### మండలి నిర్ణయంపట్ల లండన్‌వర్గాల హర్షం

లండన్, డిసెంబరు 18: కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి ప్రస్తుతం భద్రతా సంఘం అనుసరిస్తున్న విధానం చాలా యోగ్యమైనదని లండన్ వర్గాలవారు భావిస్తున్నారు.

ఇండియా, పాకిస్థాన్ ప్రతినిధులు ఈ మధ్య లేక్‌సక్సెస్‌కు పోతూ లండన్‌లో దిగినప్పుడు తమకు, ఐక్యరాజ్యసమితికిమధ్య ఇటువంటి సంభాషణలు జరగడమే యోగ్యం కాని, బహిరంగమైన చర్చ మంచిది కాదన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చి వున్నారు.

బహిరంగంగా ఈ సమస్యమీద చర్చ జరిగితే, ఆవేశాలు ఎక్కువై, మొండి ప్రకటనలు చేయడం, తరువాత వాటినే పట్టుకు వ్రేలాడటం జరుగుతుందని సూడా వారు గ్రహించకలిగారు.

జెక్ ప్రతినిధి సమర్పించిన మైనారిటీ రిపోర్టులో అట్లీ ట్రూమనుల విజ్ఞప్తిని తీసుకొని అని వారు ప్రమేయం పెట్టుకోవడంగానే ఆయన వివరించడం జరిగడాన్ని కూడా ఇక్కడి అభిజ్ఞ వర్గాలవారు వ్యాఖ్యానిస్తూ రెండు విధాలైన అభిప్రాయాల వెలిబుచ్చారు.

(1) ట్రూమన్, అట్లీలు, వీరో సాహాయ్యంగా ఉత్తరాలు (వాకేరేగా) అంతకన్నా ఇందులో ప్రమేయం అని చెప్పతగింది ఏమీలేదు.

(2) అదిగాకుండా వీరు చేసిన ఈ ప్రయత్నంలో ఐక్యరాజ్యసమితిని త్రోసిరాజనే ఉద్దేశంకూడా ఏమీ లేదు. కాశ్మీరుకమిషన్ కొత్తగాచేసిన ప్రతిపాదనలను అంగీకరించి, సమస్యా పరిష్కారానికి పూనుకోవలసిందని మాత్రమే వారు కోరారు.

ఇంతకన్నా వారువేరే అభిప్రాయాన్ని ఏమీ వెలిబుచ్చలేదు. ఇంకా ప్రభుత్వం ఈ రిపోర్టుమీద ఎటువంటి వ్యాఖ్యానమున్నూ చేయలేదు.

లేక్‌సక్సెస్‌నుంచి వస్తున్న వార్తలను బట్టి, జెక్ ప్రతినిధి అందజేసిన మైనారిటీ రిపోర్టులో చాలా అంశాలు ఇండియా చేస్తున్న వాదానికి దగ్గరగా వున్నట్లు ఇండియన్ వర్గాలవారు భావిస్తున్నట్లు తెలుస్తున్నది.

పరిష్కృత్వం ఆజాద్ కాశ్మీర్ సైన్యాలు, ఉత్తర కాశ్మీర్ ప్రాంత పరిపాలన వీటికి సంబంధించి ఆ రిపోర్టులో వున్న అంశాలు ఇండియా వాదానికి చాలా చేరవలో వున్నాయని వీరు అంటున్నారు.

# కాంగ్రెస్ వాదులపై ఖూనీ నేరారోపణ

## నిందితులు నిర్దోషులని కృష్ణాజిల్లాజడ్జి తీర్పు

విజయవాడ కొత్తపేట సంఘటనోదంతం

మచిలీపట్నం, డిసెంబరు 18: విజయవాడలోని కొత్తపేటకు చెందిన కొందరు కాంగ్రెసువాదులపై ఇం. పి. కో. 148, 149, 302, 448, 324 సెక్షన్ల ప్రకారం మోపబడిన కేసును కృష్ణాజిల్లా సెషన్సు జడ్జి విచారించి నిందితులు నిర్దోషులని తీర్పు చెప్పారు.

18-6-48 వ తేదీని నిందితులు మరి కొందరితో కలసి మొత్తం 40 మంది అక్రమసంఘంగా ఏర్పడి కొత్తపేటలోని కమ్యూనిస్టుల ఇండ్లలో జొరబడి వారిని కొట్టారని, ఆ సందర్భంలో దుర్గాని కనకయ్య, ఇల్లిపల్లి అప్పారావు, నిపోయారనీ వడ్లాది నాగయ్య తీవ్రముగా గాయపడ్డాడనీ అభియోగం.

జడ్జీగారు తీర్పులో, ముద్దాయిలందరూగానీ, కొందరుగానీ నేరముచేశారని రుజువుచేసే సాక్ష్యమేమీ లేదని అభిప్రాయపడ్డారు.

ముద్దాయిలు తాము నిర్దోషులమని వాదించారు. అసెసర్లుకూడా అట్లే అభిప్రాయపడగా జడ్జీగారు ఆ ప్రకారం తీర్పు చెప్పారు. (స్వ. వి.)

# ప్రయాణీకుల బస్సుపై కమ్యూనిస్టు కాల్పులు

విజయవాడ, డిసెంబరు 18: సూర్యాపేట-కోదాడు రోడ్డుపైనున్న నల్లగొండ గూడెంవద్ద (జగ్గయ్యపేటకు 8 మైళ్ళు) నిన్న రాత్రి 8 కు ప్రయాణీకుల బస్సుపై కమ్యూనిస్టులు అరుసార్లు తుపాకికాల్పులు జరిపిరని తెలియుచున్నది. ప్రమాదమేదియును జరుగలేదట. (స్వ. వి.)

# అత్తను హత్యచేసిన వానికి ఉరిశిక్ష

## ఇబ్రహీం పట్నం కేసులో తీర్పు

మచిలీపట్నం, డిసెంబరు 18: కుటుంబ కలహాలు కారణంగా తన రెండవ భార్య చుక్కమ్మను పొడిచి చంపే ప్రయత్నంలో, అడ్డమొచ్చిన అత్త గురమ్మను హత్య చేశాడని ఇబ్రహీం పట్నం కాపురస్తుడు బండారు ఎలమంద అనే సౌవయ్యపై ఇం. పి. కో. 307, 302 సెక్షన్ల ప్రకారం మోపబడిన కేసును కృష్ణా జిల్లా సెషన్సు జడ్జిగారు విచారించి, నిందితుడు దోషి అని నిర్ణయించి ఉరిశిక్ష విధించారు. (స్వ. వి.)

# కర్నూలు జిల్లా నుండి సెనెట్ ప్రతినిధులు

వాల్తేరు, డిసెంబరు 17: ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు సెనెట్‌లో కర్నూలు జిల్లా స్థానిక సంస్థల తరఫున సభ్యులుగా కర్నూలు పురపాలక సంఘ సభ్యుడు పి. రాజాగారు, జిల్లా బోర్డు సభ్యుడు ఆర్. కె. రామలింగా రెడ్డిగారు (బాగలమర్రి) ఎన్నికైనారు.

# రామనప్పాడివద్ద బస్సు ప్రమాదం

## 10 మందికి గాయాలు

గుడివాడ, డిసెంబరు 16: మొన్న సాయంత్రం సుమారు 6 గం. 30 ని. పామర్రు-ఉప్పుటేరు బస్సు పామర్రు వెళ్లుచుండగా గుడివాడకు 3 మైళ్లలో రామనప్పాడివద్ద తల్లక్రిందలై 10 మందికి గాయములు తగిలినవని తెలియవచ్చింది.

గాయపడినవారిని ఆస్పత్రిలో చేర్చారు. పామర్రు పోలీసులు బస్సు డ్రైవరు, రంగారావును అరెస్టు చేశారు. (స్వ. వి.)

# బస్సు ప్రమాదంవల్ల యువకుని మరణం

చీరాల, డిసెంబరు 13: నిన్న మధ్యాహ్నం చీరాలనుండి పొన్నూరుకు ఒక ప్రయాణీకులబస్సు పోవుచుండగా, పేరాల జాతీయనాయకుల విగ్రహ సమీపములో బూర్లగడ్డ వెంకటేశ్వర్లు అను ఒక యువకుడు సైకిలుమీద వాడరేవు వైపునుండి వస్తూ బస్సుకుతగిలి క్రింద పడిపోయెను. అతనికి తీవ్రంగా గాయములయ్యెను. వెంటనే అతనిని స్థానిక ఆస్పత్రికి చేర్చారు. కొన్ని గంటలతర్వాత అతను మృతిచెందెను. పోలీసువారు శవపంచాయతీ జరిపి బస్సుతగిలి క్రింద పడటంవల్ల మరణం సంభవించినదని తీర్మానించారు. ఈ సందర్భంలో పోలీసులు బస్సుడ్రైవరును అరెస్టుచేసి తర్వాత జామీనుమీద విడుదల చేశారు. ఈ విషయంలో చీరాల పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారు దర్యాప్తు చేస్తున్నారు. (స్వ. వి.)

# గుంటూరు రెడ్‌క్రాస్‌సంఘ సమావేశం

గుంటూరు, డిసెంబరు 18: గుంటూరు రెడ్‌క్రాస్‌సంఘ సర్వసభ్య సమావేశము టి. ప్రభాకరరావునాయుడుగారి అధ్యక్షతన జరిగింది. దీనికి బి. కల్యాణరావు (జిల్లా పోలీసు సూపరింటెండెంటు) శ్రీమతి కల్యాణరావు, ఎన్. కనకసుందరం (జిల్లా కలెక్టరు), జనాబ్ అబ్దుల్‌సలాం యం. యల్. ఏ. తదితర ఉద్యోగస్థులు, పుర ప్రముఖులు హాజరయిరి. గుంటూరు సుబ్రహ్మణ్యముగారు అతిథులను ఆహ్వానించిరి. సభలో సొసైటీ అధ్యక్షులగు ప్రభాకరరావుగారి రాజీనామా అంగీకరింపబడెను. రెడ్‌క్రాస్ సొసైటీ ఉద్దేశ్యములను గురించి ప్రభాకరరావుగారు విపులముగా చెప్పి విరాళములనొసగి ఈ సంస్థను పోషించవలసినదిగా ప్రజలకు విజ్ఞప్తి చేసిరి. ఈ సంస్థలో ప్రసూతి గృహముకూడ కలదు గావున స్త్రీలుగూడ ఎక్కువశ్రద్ధవహించి ఈ సంస్థను నిర్వహించవలెనని శ్రీమతి రుక్మిణీ ప్రభాకరరావుగారు చెప్పిరి.

డా॥ శ్రీమతి సి. సుశీలాదేవిగారు కార్యదర్శి నివేదికను చదివిరి. పిమ్మట జిల్లా కలెక్టరు కనకసుందరముగారు, ఏకగ్రీవముగా సొసైటీకి అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. అనంతరం కనకసుందరంగారు శ్రీ ప్రభాకరరావుగారి యొక్కయు, శ్రీమతి ప్రభాకరరావుగారి యొక్కయు చిత్రపటములను ఆవిష్కరించిరి. ప్రభాకరరావునాయుడుగారు యీ సంస్థకు చేసిన సేవను ప్రశంసించారు. సభ్యులకు తేనీటివిందు చేయబడెను. (స్వ. వి.)

# చీరాల విష్ణు ఆలయములో ధనుర్మాస మహోత్సవములు

చీరాల, డిసెంబర్ 13: చీరాల విష్ణు ఆలయములో యీ నెల 16 వ తేదీ నుండి రాబోవు జనవరి 14 వ తేదీ వరకు ధనుర్మాస మహోత్సవములు జరుగుటకు విపులప్రయత్నములు గావించుచున్నారు. ఆ నెల రోజులు నిత్యము భక్తుల ఉభయములతో పూజలు, అభిషేకములు, హరికథా కాలక్షేపములు, భజనలు, పురాణములు, మహోపన్యాసములు జరుగును.

# మంగిపూడి వెంకటశర్మగారికి సన్మానం

## సన్మానసంఘం ఏర్పాటు

పామర్రు, డిశెంబరు 14: బ్రహ్మశ్రీ అభినవపోతన మంగిపూడి వేంకటశర్మగారికి బందరులో సన్మానము చేయుటకు నిశ్చయింపబడినది. ఇందుకు కోగంటి దుర్గామల్లికార్జునరావు, చిత్రపు హనుమంతరావు, చిట్టా బాలకృష్ణశాస్త్రి, వి. రామకోటయ్యచౌదరి, కె. కామేశ్వరరావు, తేకుమళ్ల రామచంద్రరావు, రాళ్ళభండి వెంకటసీతారామశాస్త్రి గారలతో సన్మాన సంఘం ఏర్పాటు చేయబడింది.

## కీ॥ శే॥ తూము చూడామణి అమ్మగారు

పోలవరం, డిసెంబరు 13: ఈ జిల్లాలో కాంగ్రెస్ ప్రచారకురాలు, స్వరాజ్యాశ్రమ సభ్యురాలు, గాంధీమహాత్ముని శిష్యురాలు రాజకీయ బాధితులు అను శ్రీ తూము చూడామణి అమ్మగారు ఈనెల 3 వ తేదీని స్వర్గస్థులైనారు.

# చీరాల పురపాలక సంఘ సమావేశం

చీరాల, డిసెంబరు 10: ఈ పురపాలక సంఘ సమావేశం అన్నదాత నాగేంద్రుడిగారి అధ్యక్షతను మొన్న జరిగినప్పుడు, పత్రికా ప్రతినిధులకు పురపాలక సంఘ సభల అజెండా ప్రతులు పంపవలెననియు, సంఘ సమావేశాలలో ప్రత్యేక సీట్లవసతి కలిగించవలెననియు సంఘ సభ్యులైన ఎం. ఏలియంగారు పంపిన తీర్మానం చర్చకు వచ్చింది. పత్రికా ప్రతినిధులకు అజెండా ప్రతులిచ్చుటకు వీలులేదనియు, వారికి ప్రత్యేక సీట్లవసతి కలిగించుటకు వీలులేదనియు తీర్మానం చేయబడింది.

ప్రథమంలో నాటిసభ అశాస్త్రీయమైనదని చెప్పి 5 గురు సభ్యులు సభనుండి బయటకు వెళ్లారు. తర్వాత సమావేశానికి వచ్చిన కొంతమంది సభ్యులలో మరి ముగ్గురు సభ్యులుకూడ బయటకు వెళ్లిపోయారు.

అనంతరం, విశాల పురంలో 10లాంతర్లు ఏర్పాటు చేయుటకును, గ్రామంలో దీపాలు వృద్ధిచేయుటకు 50 పెట్రోమాక్సు లైట్లు కొనుటకును పదివేలరూపాయలు మంజూరు చేస్తూ తీర్మానం చెయ్యబడింది. అగ్నిప్రమాదముల సందర్భంలో మంటలార్పుటకు ఫైలర్ పంపు కొనుటకు రు. 3000 లను, ఒక లారీని కొనుటకు 13 వేల రూపాయలను మంజూరు చేశారు. పేరాల మదనగోపాలస్వామివారి వీధిలో స్థాపింపబడిన జాతీయ నాయకుల విగ్రహములను తీసివేయవలసినదని 1949 నవంబరు 11 వ తేదీ నాటి ప్రభుత్వ ఉత్తరువును, దానిపై టి. ఎల్. కాంతంగారు పురపాలక సంఘానికి యిచ్చిన దరఖాస్తును చర్చించి, విగ్రహములు నిర్మించుటలోగా పేరాల పంచాయతీబోర్డువారు లైసన్సు మంజూరు చేసినందున, తమ ఉత్తరువు పునరాలోచింపవలసిందని ప్రభుత్వమును కోరుచూ, ప్రభుత్వ ఉత్తరువులు వచ్చువరకు కమీషనరుగారిని ఎట్టి చర్య తీసుకోవద్దని కోరుతూను తీర్మానించారు.

అనంతరం మునిసిపాలిటీలో కొన్ని మరమ్మతులు, కొన్ని వసతులు చేయుటకు సుమారు 11 వేల రూపాయలకు అంచనాలు మంజూరు చేయబడెను. కొన్ని రోడ్లు వేయుటకు, కొన్ని రోడ్లకు కంకర వేయుటకు, కొన్నిటికి మరమ్మతులు చేయుటకు రూ. 32685 ల అంచనాలు ఆమోదించబడెను. మశూచి వ్యాధి నివారణకై ఇద్దరు వాక్సినేటర్లను, 4 గురు కూలీలను నియమించుటకు నిర్ణయించారు. తర్వాత చీరాల హైస్కూలు విద్యార్థుల ఆటలస్థలములో డేరా వేసుకొనుటకు పరశురాం సైన్ సర్కసువారికి రు. 500 లకు అద్దెకు యివ్వటానికి నిర్ణయించటమైనదన్న కమిషనరుగారి ప్రతిపాదన చర్చకు వచ్చి కొంతచర్చ జరిగిన అనంతరం ప్రతిపాదన ఆమోదించబడింది. ఈ అద్దె మొత్తమును విద్యార్థుల ఆటస్థలమును అభివృద్ధిచేయుటకే ఖర్చుచేయవలెనని ఒక సూచనచేయబడింది. పేరాలలో ఒక ఆయుర్వేద ఆస్పత్రిని స్థాపించుటకు నిర్ణయం చెయ్యబడింది.

'సమావేశంనుండి బయటకువచ్చిన 8 మంది సభ్యులు, మొన్న జరిగిన సమావేశం అశాస్త్రీయమని గుంటూరు జిల్లా కలెక్టరుగారికి, మద్రాసు స్థానికసంస్థల ఇన్‌స్పెక్టరుగారికి, చీరాల పురపాలక సంఘాధ్యక్షునకు నిన్న అర్జీలు పంపారని తెలుస్తున్నది. (స్వ. వి.)

# వయోజన విద్యా పాఠశాల ప్రారంభోత్సవము

రాజమండ్రి, డిసెంబరు 12: స్థానిక జాతీయ విద్యాలయమునందు శుక్రవారము రాత్రి సుమారు 9 గంటలకు స్కూలు కమిటీ కార్యదర్శి అప్పన సుబ్బారావుగారి అధ్యక్షతను సభ జరుపబడెను. ప్రభుత్వ కార్యక్రమమున కనుగుణంగా వయోజన విద్యాపాఠశాల ప్రారంభించబడినది. కమిటీసభ్యులును, పలువురు వర్తక ప్రముఖులును; విద్యాశాఖ సీనియర్, జూనియర్ డిప్యూటీ యిన్‌స్పెక్టరుగార్లును సభకు హాజరయ్యారు. కార్మిక వయోజనులు అనేకమంది విద్యార్థులుగా చేరుటకు ఉత్సాహపూరితులై వచ్చారు. ఇనస్పెక్టరుగార్లు తిరుపురును వయోజన విద్యనుగూర్చి, దాని ఆవశ్యకతనుగూర్చి విపులముగా నుపన్యసించిరి.

పాఠశాలోపాధ్యాయులు యీసందర్భమున పాఠశాల విద్యార్థులచే వయోజన విద్య ఆవశ్యకతను జెల్పునొక ప్రహసనము, విద్యార్థినులచే నాట్య ప్రదర్శనములను ఏర్పాటు చేసిరి. ప్రధానోపాధ్యాయుని వందన సమర్పణానంతరము అల్పాహారవిందులతో సభ ముగిసెను.

# కమ్యూనిస్టు అరెస్టు

పొన్నూరు, డిసెంబరు 15: పరారీలో నున్న కమ్యూనిస్టు పుట్టా సుందరరావును, దొప్పలపూడి రోడ్డువద్ద నిన్న సర్కిలు యిన్‌స్పెక్టరు కె. చంద్రమౌళి, జూపూడి సబ్‌ఇన్‌స్పెక్టరు కె. మాణిక్యాలరావుగారు అరెస్టుచేశారు. (స్వ. వి.)

# ప్రొద్దుటూరు పురపాలక సంఘ సమావేశం

## 1950-51 బడ్జెటు అంచనాల ఆమోదం

ప్రొద్దుటూరు, డిసెంబరు 13: నిన్న సాయంకాలం 5 గంటలకు పి. ఎర్రమునిరెడ్డి మునిసిపల్ చైర్మన్‌గారి అధ్యక్షతను 1949-50 సం॥ సవరణ మదింపు, 1950-51 ఆదాయవ్యయపట్టీ అంచనా పరిశీలన నిమిత్తం స్థానిక పురపాలక సంఘం సమావేశమైంది. 1949-50 సం॥ సవరణ మదింపు ప్రకారం ఆదాయం రు. 4,32,159 రూపాయలు, యీమొత్తంలో సంవత్సరారంభం నిల్వ, ప్రాథమిక విద్యకు యివ్వబడిన గ్రాంటు చేర్పబడింది. 1950-51 సం॥ అంచనాలో రాబడి 3,45,930 రూపాయలు. ఖర్చు 3,76,780. యీ విషయం పరిశీలనచేయడానికి ఒక ఉపసంఘాన్ని నవంబరు 29వ తేదీ కౌన్సిలు సమావేశంలో నియమించారు. ఆ ఉపసంఘం ఆదాయవ్యయ పట్టికను పరిశీలించి, అంచనా జమఖర్చులు సరిపోవడానికి 10 వేల రూపాయల అంచనాలు తగ్గించమని సిఫారసు చేసింది. బొల్లవరానికి నీటి సరఫరాచేసే నిమిత్తం 1500 రూపాయలు, 10 వేల రూపాయలు నీరు తెచ్చే లారీకి, డ్రైనేజి పరిశోధన స్కీముకు 1500 రూపాయలు, మునిసిపల్ ఆస్పత్రిలో రెండవ కాంపౌండరు కాలీలో మొగనర్సులు నియమించుట మొదలైన కమిటీ సిఫార్సులను దానిపై కమీషనరు సూచనను కౌన్సిలు ఆమోదించింది.

1950-51 సం॥ అంచనాలో హైస్కూలు భవనము యింకా పెద్దదిగా కట్టడానికి 5 వేల రూపాయలు, బస్సు స్టాండులో యున్న పెద్ద కోనేరును పూడ్చుటకు 5 వేల రూపాయలు ఏర్పాటు చెయ్యబడింది. ఇంజనీరు ఓవర్సీయరును నియమించుకొనుటకుకూడా అవకాశం కలిగించబడింది. అంచనాలపై కొంత చర్చ జరిగిన అనంతరం, ఉపసంఘ సలహాలు, వాటిపైని కమీషనరు సూచనతో యున్న ఆదాయవ్యయ పట్టిక అంచనాలను కౌన్సిలు మంజూరు చేసింది. (స్వ. వి.)

# బళ్లారిజిల్లా ఎన్. జి. ఓ.ల సభ

హాస్పేట, డిసెంబరు 12: బళ్లారిజిల్లా ప్రభుత్వ నాన్‌గెజెటెడ్ ఉద్యోగుల సభ నిన్నటిరోజున స్థానిక మునిసిపల్ హైస్కూల్ భవనమందు కన్నన్‌కుట్టిమీనన్‌గారి అధ్యక్షతక్రిందజరిగింది. చెన్నరాష్ట్ర ఆహారమంత్రిగారగు రోచ్ విక్టోరియాగారు సభా ప్రారంభోత్సవమును గావించుచు, నాన్‌గెజెటెడ్ ఉద్యోగుల కష్టనిష్ఠూరములను విచారించుటకు తన తోడి మంత్రులకు తెలియజేసి, తన చేతనైన సహాయమును చేయగలనని చెప్పిరి. అనంతరం సభ మధ్యకాలముయందునసే తుంగభద్రా ప్రాజెక్టును సందర్శించుటకుగాను వెళ్ళిరి. అధ్యక్షులును, చి. వెంకటరత్నముగారును, నాన్‌గెజెటెడ్ ఉద్యోగుల కష్టములను గురించియును ప్రభుత్వము చేయవలసిన సహాయమును గురించియును విపులముగా ఉపన్యసించిరి. వి. సుబ్రహ్మణ్యముగారు సంఘచరిత్రను క్లుప్తముగా చెప్పిరి. అనంతరము కొన్ని తీర్మానములు చేయబడెను.

## జిల్లా బోర్డు అధ్యక్షులకు విందు

ఇచ్చట వీరశైవ వర్తక సంఘమువారు జంబుకేశ్వరస్వామి దేవాలయముయందున బళ్ళారిజిల్లా బోర్డు అధ్యక్షులగు వై. మహాబలేశ్వరప్పగారి గౌరవార్థమై మొన్న విందు చేశారు. (స్వ. వి.)

# విజయనగరంలో పండితసభ

విజయనగరం, డిసెంబరు 13: విజయనగర మధ్య యువజనసంఘ యాజమాన్యమున మొన్న ఆదివారం సాయంత్రం 6 గం॥లనుండి శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయములో వగురుమూడి వేంకటరావుగారి అధ్యక్షతక్రింద పండితసభ జరిగింది. శతావధానులు శ్రీ రాంభట్ల జగన్నాథశాస్త్రిగారు తాము సంస్కృతభాషలో రచించిన "దశావతారస్తుతి" యందుగల విశేషార్థముల గురించి ముచ్చటించిరి. అవి వేషార్థములలో అవతారపరంగా ఒక అర్థము మహాత్మగాంధీ పరంగా మరొక అర్థం, చాలా చక్కగా చెప్పిరి.

అధ్యక్షులు శ్రీ శాస్త్రిగార్ని గురించి ముచ్చటించుచు ఆయన పండితోత్తములని ప్రశంసించారు.

# లూథరన్ ట్రెయినింగు పాఠశాల వార్షికోత్సవము

నర్సారావుపేట, డిసెంబరు 14: స్థానిక అమెరికన్ లూథరన్ ట్రెయినింగ్ పాఠశాల 4 వ వార్షికోత్సవము మొన్నటి సాయంత్రము కాసు బ్రహ్మానందరెడ్డి యం. యల్. ఏ గారి అధ్యక్షత క్రింద జరిగెను. వ్యాయామక్రీడలయందు గెలుపొందిన పిల్లలకు స్థానిక డిప్యూటీ కలెక్టరుగారి సతీమణి శ్రీమతి హెచ్. సాంబమూర్తిగారి చేతబహుమతులు ఒసంగారు.

## కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, డిసెంబరు 17: కృష్ణానది నీటిమట్టం నేడు అనకట్టపై 6. అడుగులున్నది.

# కర్నూలు జిల్లాలో జొన్నల సేకరణ

## అసెంబ్లీలో ఆహారమంత్రి జవాబు

మదరాసు, డిసెం 17:— శ్రీ శివర్తి వెంకటసుబ్బయ్యగారి ప్రశ్నకు జవాబు ఇచ్చుచూ కర్నూలు జిల్లాలో జొన్నల సేకరణ మందగించినదని అసెంబ్లీలో నేడు ఆహారమంత్రి తెలిపిరి.

జొన్న పంట విరివిగా వున్నందుననూ వుత్పత్తిదార్లు హోటళ్లకు ధాన్యమే మజూరీగ ఇచ్చుచున్నందుకు కారణమని సేకరణ ఏజంటుగా వున్న సహకార సంఘమునకు ... లేకపోవుట కూడా కొంత కారణమని మంత్రిగారనిరి.

జిల్లా ఆహార సంఘమునుండి విన్నపము ఏమీ రాలేదు, కాని జిల్లా కలెక్టరు మాత్రము సేకరణను నిలిపి వేయుమని ఆహార సంఘము తీర్మానించినట్లు వ్రాశిరనియు తెలిపిరి.

కలెక్టరు ఇంకనూ 1949 సెప్టెంబరు నెలలో సేకరణ ఇబ్బందులను వివరించుచూ మిగులు సరుకును అవసరమున్న ప్రాంతములకు పంపిన మిగిలిపోయిన డబ్బు విడుదలై సేకరణకు వీలుకలుగుతుందనీ ఇది జరుగనియెడల సేకరణను తాత్కాలికముగా ఆపుచేయక తప్పదనికూడ వ్రాశిరని మంత్రిగారనిరి.

ధాన్యసేకరణను నిలిపి వేసిన మిగులు అంతా మాయమవుతుందని ప్రభుత్వము కలచి మిగులు జొన్నలను కొరవ ప్రాంతములకు ఎగుమతిచేయవలెనని బోర్డును కోరుచు, స్థానికముగా గిరాకీ లేనియెడల ఇతరచోట్లకు పంపుటకు సేకరణను తీవ్రముగా కొనసాగించవలెనని కలెక్టరుకు వుత్తర్వుపంపమని కోరెను.

రాయలసీమ జిల్లాకు 1000 టన్నులు ప్రత్యేకించబడే సరుకు కదులుచున్నది. మరొక 3 వేల టన్నులుకూడ పంపదలచి తిరుగాని హైదరాబాద్‌వారు బియ్యమునకు బదులు జొన్నలు కావలెనని కోరినందున అపుడల చేయబడినదికాని హైదరాబాద్‌తో బేరం కుదరనందున సరుకును అవసరమైన ఇతరచోటుకు పంపుటకు బోర్డు చర్యతీసుకొనుచున్నది. దీనితో స్టోర్సుడబ్బు చిక్కు కొంతతీరగలదు.

సేకరణకుగాను స్టోర్సుకు ఇచ్చిన రు. 7 లక్షల ఋణము తీర్చుటకు గడువు పెంచబడినది. ఈ చర్యలవల్ల మిగులువంతను స్టోర్సు సేకరించగలదనీ, పరిస్థితి చక్కబడగలదని ప్రభుత్వము ఆశించుచున్నదని ఆహారమంత్రి తెలిపిరి.

## మద్యనిషేధ ప్రచారకుల నియామకం

మదరాసు, డిసెంబరు 17: మద్యనిషేధ మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు నేడు అసెంబ్లీలో ప్రభుత్వము 442 మద్యనిషేధ ప్రచారకులను నెలకు రూ. 70-3-100 జీతమువిూద నియమించుటకు నిశ్చయించినదని తెలిపిరి.

ఈ ప్రచారకులకు మామూలు కరువు భత్యము, సైకిళ్లు వున్నచోట రూ. 15ల సైకిల్ అలవెన్సు, నెలకు 25 రోజులు కనీసం సంచారము చేసినచో రు. 15/ల ప్రయాణపు అలవెన్సు ఇచ్చెదరనీ, యీ ఉద్యోగములు ఒక సంవత్సరమునకు మంజూరు చేయబడినవనీ కూడ మంత్రిగారు జనాబ్ రజాఖాన్ ప్రశ్నకు యిచ్చిన సమాధానములో తెలిపిరి.

రజాఖాన్ అనుబంధ ప్రశ్నకు సమాధాన మిచ్చుచూ ఎక్సైజుక్రింద రు. 17 కోట్లు పోయినా ప్రభుత్వము అవసరముకు సొమ్మును ఖర్చుచేయగలదని మంత్రిగారనిరి.

వీరు గూఢచారులుగా కూడ వుండెదరా యని అన్వార్ అడిగిన ప్రశ్నకు సమాధానము ఇవ్వలేదు.

మంత్రులు, సభ్యులుచేసే ప్రచారము వల్లన లాభములేనప్పుడు ఈ ప్రచారకుల వల్ల మద్యనిషేధమునకు ఎంతవరకు వుపయోగపడగలదని అబ్దుల్‌మజీద్ అడిగిన ప్రశ్నకు ఈ ఉద్యోగులవలె మంత్రులు, సభ్యులు మారుమూలకు వెళ్లలేరని మంత్రిగారనిరి.

మద్యనిషేధమునందు విశ్వాసము గలవారే నియమించబడెదరని శ్రీ కె. భాష్యంగారికి మంత్రిగారు తెలిపిరి, అనుభవము గలవారు నియమించబడెదరని కుమారస్వామిగారికి తెలిపిరి.

మద్యనిషేధ ఉద్యోగులు త్రాగుచున్నారనగా అటువంటి కేసులు తెలిసిన తప్పక చర్య తీసుకొనెదమని మంత్రిగారనిరి.

## డా॥ రాజేంద్రప్రసాదు

వార్ధా, డిసెంబరు 17: లక్నో విశ్వవిద్యాలయ పట్టప్రదానోపన్యాసము గావించుటకు డా॥ రాజేంద్రప్రసాదుగారు డిసెంబరు 20 తేదీన లక్నోకు వెళ్లెదరు. డిసెంబరు 23 తేదీన పట్టప్రదానోపన్యాసము గావించి 21 తేదీన వార్ధాయున్నటికి తిరిగివచ్చెదరు.

# ఆహారధాన్యంగా జొన్నల విలువ

## గవర్నరు జనరలు హితవు

చెన్నపట్నం, డిసెంబరు 18: మన ఆహారములో బియ్యముకంటే జొన్నలు, గోధుమలవంటి ధాన్యాలను ప్రజలు ప్రధాన్య మివ్వవలెనని చెప్పుట దేశములో బియ్యముకొరవడి యున్నదనే కారణము అంతముఖ్యముకాదు. అవి పుష్టికరమైన ఆహారమనిభావించవలె నేకారణము. ఆ ఆహారము అనుసరించుటవల్ల మనకు మేలుకలుగుటయేగాక బియ్యము కొరతనూ ఎదుర్కొనటకు వీలగును. అని గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు నిన్న సాయంత్రం లేడీవిల్లింగ్డన్ ట్రెయినింగ్ కాలేజీ ఎదుట సేవామందిరములో బియ్యం చేరని తినుబండారముల ప్రదర్శనమును ప్రారంభించుచు నుడివిరి.

గవర్నరుజనరలు శ్రీరాజాజీగారు మదరాసు గవర్నరుతో రాగా సేవమదరాసు వినిమయదార్ల సంఘాధ్యక్షుడున్ను న్యాబషీర్ అహ్మద్ సయ్యద్, కార్యదర్శి శ్రీ ఆర్. ఆర్. దళవాయిగార్లు వారికి ఆహ్వానమొసగిరి.

సభ శ్రీ యం. యం. దండపాణిదేశికరు ప్రార్థనగీతముతో ప్రారంభమైనది.

న్యా॥ బషీర్ అహ్మద్‌గారు గవర్నరు జనరలుకు స్వాగతం తెలుపుచూ దేశమున బియ్యము చాలక యిబ్బందిగ నుంటున్నందున ఆ కొరతను తీర్చుటకు బియ్యంచేరని ఆహార పదార్థముల యిట్టి ఫలహారశాలలు విరివిగా ప్రారంభించి ప్రచారము చేయుట అవసరమనిరి. శ్రీ రాజాజీగారిని భారతదేశ అధ్యక్షుడుగా ఆహ్వానించే భాగ్యం తమకు అనతికాలములోనే లభింపనని ఆశిస్తున్నామనిరి.

ఆహారమంత్రి శ్రీ రోచ్ విక్టోరియాగారు మన ఆహారము పుష్టిని కలుగజేయునదిగా నుండుట అవసరమనియు బియ్యం వాడుకను తగ్గించుటకు ప్రారంభమైనయీ ఉద్యమమునకు మొదట, ఎట్టియాపురంలో సుభాశీస్సులనిచ్చి ప్రారంభించినది గవర్నరు జనరలుగారే యనియు, బియ్యము మానిజొన్నలు తదితర ధాన్యాలకు ప్రజలు అలవాటు పడుటకు వాటినుండికూడా రుచికరమైన భక్షణములు తయారుచేయ వీలగునని యీ క్యాంటీన్లు చాటగల్గుననిరి.

### రాజాజీప్రసంగం

గవర్నరు జనరలు శ్రీ రాజగోపాలాచారిగారు క్యాంటీన్‌ను ప్రారంభించుచూ యిట్లనిరి: నా విషయమై మీరు స్వాగతపత్రముతో చెప్పిన మంచి మాటలకు నా వందనములు. జొన్నలువాడే క్యాంటీన్ ప్రారంభించమని నన్ను కోరినపుడు నేను యిష్టముతో అంగీకరించితిని. ఇది యేదో ఒక చిన్న సభయగునని అనుకొన్నాను. మదరాసున నా కార్యక్రమములో దీనికి ప్రసక్తి నిచ్చినపుడు యీసభ వారు స్వాగతమిచ్చే సభ యగునని నేను అనుకోలేదు. అదే యిపుడు జరిగినది. బియ్యం వాడని భక్షణముల ప్రదర్శనమును చూడవలెనను ఆశకంటే నన్ను చూడవలెననే ఉద్దేశ్యముతోనే చాలా మంది యిక్కడ వచ్చినట్లు దోచుచున్నది. (నవ్వు) నేను తెరువబోయే క్యాంటీన్‌లో ఏమియున్నదో నాకు తెలియదు. అది చూచిన తరువాత గాని దానిని వివరించలేను. బియ్యము వాడకము తగ్గించవలెననే తలంపుతో యీ ప్రచారము సాగింపబడుచున్నట్లు తెలియుచున్నది. బియ్యంకొరతసంగతి అలావుండ నిచ్చి జొన్నలు మున్నగు ఆహార పదార్థములు బియ్యముకంటే పుష్టికరమైనవి గనుకనే వాటికి మనము ముఖ్యముగా అలవాటుపడితే మనకు పుష్టికలిగి ఆరోగ్యము బాగుపడును. ఈ కారణమువలననే మనము యీ ఆహారమును పుచ్చుకొనుట మంచిది. ఉన్నత కులాలవారు దీనిని విశేషము తల పెట్టి ఉపక్రమించితే సామాన్యులుకూడా అనుసరించగలరు. తద్వారా బియ్యం లోటు కూడా మనకు తీరును.

### రిపబ్లిక్ అధ్యక్షత

బషీర్‌అహ్మద్ సయ్యద్‌గారు స్వాగతమొసగుచూ శ్రీ రాజాజీ భారత రిపబ్లిక్ ప్రథమ అధ్యక్షుడు కావలెనని తెలిపిన తలంపును గూర్చి గవర్నరు జనరలుగారు ప్రస్తావించుచూ ఇట్లు నుడివిరి: ఈ వారానికి నాకు 70 యేండ్లునిండిపోయినవి. ఇన్ని యేండ్లు అయిన తరువాత కూనా మదరాసు రోడ్డు మీదగాని లేక ఢిల్లీ రోడ్డు లేదా మరోరోడ్డు మీదగాని యింకా నేను ఎద్దుబండిని లాగవలెనని మీ యభిప్రాయమునా? విశ్రాంతికి నేను చాలా అర్హుడనైయున్నాను. నా శ్రేయోభిలాషులు సమయము విశేష బాధ్యత కష్టములతో కూడిన అధ్యక్షపదవిని నేను వహించవలెనని కోరవం తగదు. మీ గుణానుభవం చూపిన శ్రేయస్సుకు వందనములు." అని శ్రీ రాజాజీగారు క్యాంటీన్‌గుమ్మముకు కట్టబడియుండిన రిబ్బన్‌ను విప్పడిచే క్యాంటీన్ ప్రారంభోత్సవము జరిగెను.

అనంతరం వారు యితర అతిథులు ఫలహారములు వంటకములను తిలకించిరి.

# పాకిస్థాన్‌కు విస్తారంగా కెనడా ఆయుధాలు

## గత 10 మాసాలలో 76 లక్షల కిమ్మతుచేసే సామగ్రి కొనుగోలు

అట్టావా, డిసెంబరు 17: పాకిస్తాను ప్రభుత్వపు సంచార రాయబారియగు నవాబు ముస్తాక్ ఏ. గుర్మానీ అయిరోపా ఖండంలో పర్యటనచేసి ఉత్తర అమెరికాలో కెనడా దేశమందు యిప్పుడు పర్యటించుచున్నారు పత్రికా ప్రతినిధులతో మాట్లాడుచు గుర్మానీగారు నిన్న యిట్లు చెప్పిరి.

భారతప్రభుత్వపు సేనలో సగంభాగం కాశ్మీరులోనే యున్నది. కాశ్మీరు జనవాక్య నిర్ణయము జరుగుటనిమిత్తమై కాశ్మీరునుంచి ఇండియాప్రభుత్వ సేనలు తొలగింపబడిన యెడల, అచటినుంచి పాకిస్తాను సేనలు కూడా తొలగింపబడును. మాకు కాశ్మీరము గుండెకాయవంటిది. భారత ప్రభుత్వానికి అది పారితోషికము వంటిది. పాకిస్తాను విడిపోయిన నాటినుండియు సమర్థమైన సేనను ఏర్పాటు చేసికొనుచున్నది కాని అమితమైన ధనవ్యయం చేయుచున్నది. పాకిస్తానుకు కావలసిన ఆయుధ సామగ్రులలో విశేషభాగమును కెనడానుంచి తెప్పించుకొనుచున్నదని చెప్పిరి. కాని ఆ మాటను తిరిగి సవరించుకొనుచు "దుస్తులు, బూట్సులు, మిలిటరీ మోటారు లారీలు" మాత్రము కెనడానుంచి తెప్పించుకొనుచున్నదనిరి.

కెనడా వర్తక వ్యాపార సంబంధమైన ప్రభుత్వలెక్కలను పరిశీలించి చూడగా యీ సంవత్సరము మొదటి 10 మాసముల లోను కెనడానుంచి పాకిస్తానుకు 76 లక్షల డాలర్ల కిమ్మతుగల తోటాలను ఫిరంగులకు తుపాకులు ఎగుమతి చేయబడెను. ఒక్క అక్టోబరు మాసంలోనే 8 లక్షల డాలర్ల కిమ్మతుగల ఫిరంగులకు మందుసామగ్రి రవాణా చేయబడెను. ఈ సంవత్సరంలో ఇట్టి రవాణా లేవియు ఇండియాకు చేయబడలేదు.

భద్రతామండలియందు కాశ్మీర్ సమస్య నేడు చర్చింపబడును గనుక నవాబు గుర్మానీగారు లేకసక్సెసుకు వెళ్లి భద్రతా మండలి సమావేశమునకు హాజరయ్యెదరు.

## బ్రిటిష్ పార్లమెంటు సభ్యుని ప్రసంగం

లండను, డిసెంబరు 16: కరాచీలోని "డాన్" పత్రికా సంపాదకుడగు అల్తాఫ్ హుస్సేనుగారు లండనులో యిట్టుయుండి యీ అసోసియేషనువారి సభలో "పాకిస్తానుయొక్క విదేశ వ్యవహార సంబంధములు" అను విషయమునుగూర్చి ఒక వ్యాసము చదివిరి. ఈ సభకు బ్రిటిష్ పార్లమెంటులోని కన్సర్వేటివు పక్ష సభ్యులగు ఆర్. ఎ. బట్లరుగారు అధ్యక్షత వహించిరి.

అల్తాఫ్ హుస్సేనుగారు తమ ఉపన్యాసములో ఇట్లు చెప్పిరి.

ఆసియాఖండ సంయుక్త వ్యవహారములందు కొన్ని పశ్చిమరాజ్యాలు భారతదేశమే తమకు ఆయువుపట్టుగా కేంద్రభూమిగా భావించి దానినే ఎక్కువగా అభిమానించుచున్నారు. పాకిస్తానుపై ఎటువంటి వ్యగ్రచర్యలను ఇండియా సాగించుచున్నను ఇండియా ప్రభుత్వమును ఆదరించుచున్నారు.

బట్లరుగారు తమ అధ్యక్షోపన్యాసములో ఇట్లు చెప్పిరి.

ప్రస్తుతపు బ్రిటిష్ కార్మికపక్ష ప్రభుత్వ వర్గమును కన్సర్వేటివుపార్టీ ఎంత ప్రతిఘటించినను కామన్వెల్తు రాజ్యాల వ్యవహారవిషయములందు కార్మికపక్షముతో మేము కలిసి సంప్రతించుచునే వున్నాము.

పాకిస్తాను ఇండియాల విషయములో ఏదో ఒక రాజ్యముయెడల అభిమానం వహించుచున్నామనుట నిజముకాదు.

బ్రిటిష్ కామన్వెల్తుయొక్క భవిష్యత్తు ఐరోపా పశ్చిమ రాజ్యాల భవిష్యత్తుతో మాత్రమే ఆధారపడలేదు. అమెరికా సంయుక్తరాష్ట్రముల భవిష్యత్తుతో సంబంధించియున్నది. పాకిస్తాను ప్రధాన మంత్రి లియాకతాలీఖానుగారు అమెరికాకు వెళ్లినప్పుడు అందువల్ల చాలా ఫలితముండగలదు.

బ్రిటనుకు అమెరికా చేసే సహాయం బ్రిటిష్ కామన్వెల్తుకుకూడా లభించగలదు. ఇండియాకు పాకిస్తానుకు సింహళానికికూడా లభించగలదు, బర్మాకు కూడా లభించును. పాకిస్తానున్నూ ఇండియాయున్నూ కలిసి ఒక లంకెగా ఏర్పడి అమెరికాకున్నూ బ్రిటిష కామన్వెల్తుకున్నూ ఎక్కువ సంబంధమును కల్పించగలదు. తద్వారా ప్రపంచ శాంతికి తోడ్పడగలదు.

# మైసూరు కాంగ్రెసు పార్టీ నాయకత్వం

## కే. సి. రెడ్డిగారి ఎన్నిక

బెంగుళూరు, డిసెంబరు 17: ఈవేళ కె. సెంగల్రాయ రెడ్డిగారిని మైసూరు శాసనసభలోని కాంగ్రెసుపక్షాన నాయకులుగా ఎన్నుకున్నారు. వీరికి 38 వోటులువచ్చాయి. వీరిప్రత్యర్థి కె. హనుమంతయ్యగారికి 25 వోట్లే వచ్చాయి. ఈవేళ మైసూరుకాంగ్రెసు పక్షపార్టీ చైర్మెను యస్. చెన్నయ్యగారి అధ్యక్షతను సమావేశమై ఈ నిర్ణయం చేసింది.

మైసూరులో పూర్వపు శాసనసభను రద్దుచేసి, సంస్థాన ప్రజాపరిషత్తును, శాసనసభగా మార్చడంవల్ల ఈ ఎన్నిక జరగవలసిన ఆవశ్యకత కలిగింది.

ఈ సభలో ఉన్న 65 గురు సభ్యుల లోను 68 సభ్యులు మాత్రమే హాజరైనారు.

మైసూరులో బాధ్యతాయుతప్రభుత్వం స్థాపించిన తరవాత రెండేళ్ళకు పూర్వము కె. సి. రెడ్డి ప్రధానమంత్రి అయ్యారు మళ్లీ ఇప్పుడుకూడా మళ్లీ ఆయనే ప్రధానమంత్రి అయ్యారు.

## ఢిల్లీకి నిజలింగప్పగారి ప్రయాణం

బెంగుళూరు, డిసెంబరు 18: కర్ణాటక రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు యస్. నిజలింగప్ప, ఈ వేళ బెంగుళూర్‌నుంచి విమానంలో బయలుదేరి బొంబాయి వెళ్లాడు. అక్కడినుంచి ఢిల్లీ వెళ్ళి కాంగ్రెస్ కార్యవర్గ సమావేశానికి హాజరవుతారు.

కర్ణాటకరాష్ట్ర కమిటీ నిర్ణయమును, అందుకుగల కారణములను, కాంగ్రెస్ కార్యవర్గానికి వివరిస్తారు.

ఢిల్లీ వెళ్లేముందు, బొంబాయిలో పత్రికా విలేఖరుల సమావేశంలో మాట్లాడుతారు. కర్ణాటకరాష్ట్ర కాంగ్రెస్ అవలంబించిన వైఖరిని యీ పత్రికా విలేఖరుల సమావేశంలో వివరిస్తారు.

మైసూర్ శాసనసభ కాంగ్రెస్‌పార్టీ నాయకుని ఎన్నిక సందర్భమున, నిజలింగప్ప బెంగుళూర్‌లో ఉండవలసివచ్చింది. ఇక్కడ ఉండగా కర్ణాటకరాష్ట్ర కాంగ్రెస్ నిర్ణయంపట్ల మైసూర్ కాంగ్రెస్ పార్టీ అభిప్రాయమును తెలుసుకొన్నారు.

కర్ణాటక రాష్ట్ర ఏకీకరణ సూత్రమును మైసూర్ కాంగ్రెస్ ఆమోదించింది సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గము గతనెల సమావేశమై మైసూర్‌ను చేర్చి కర్ణాటకరాష్ట్రమును నిర్మించుటకు అనుకూలంగా తీర్మానించింది.

కర్ణాటక రాష్ట్రనిర్మాణ సూత్రమునకు మైసూర్ కాంగ్రెస్ అంగీకరించినప్పటికీ, యిటీవల కర్ణాటకరాష్ట్ర కాంగ్రెస్‌నాయకులుఅవలంబించినచర్యలపట్ల మైసూర్ సంస్థానములో అనుకొన్నంతగా ఉత్సాహం కన్పించుటలేదు. మైసూర్ కాంగ్రెస్ నాయకాగ్రేసరులు, ప్రభుత్వంలో ఉన్నవారుగూడా, కర్ణాటక రాష్ట్రనిర్మాణం విషయంలో కాంగ్రెస్ పెద్దలతీర్పే ఉత్తరువైనదిగా భావిస్తున్నారు. సంస్థానంలో మరొక వర్గంవారు, కర్ణాటక రాష్ట్రమును తక్షణం నిర్మించాలని, క్రితం నెల ఉద్యమాన్ని ప్రారంభించారు. వీరే, అఖిలపార్టీ సమావేశాన్ని ఏర్పాటు చేసి, మహారాజాను తొలగించి తక్షణమే రాష్ట్రాన్ని నిర్మించాలని తీర్మానించారు.

మైసూర్ మహారాజా పదవిలో ఉన్నంతకాలమూ రెండు పార్టీలవారిని ఏకంచేయడం అసంభవమని నా అభిప్రాయం. కర్ణాటకరాష్ట్ర నిర్మాణానికి మహారాజా అవరోధంగా ఉన్నాడని అంతా అనుకుంటూనే ఉన్నారు. కాబట్టి యిప్పుడు మహారాజాను తొలగించుటకు ప్రయత్నాలు జరుగుతున్నవి.

గత రెండేండ్లుగా మైసూర్‌లో మహారాజాను తొలగించు అభిప్రాయానికి కులు బలపరస్తున్నారు. ఇప్పుడు మహారాజా పార్టీకూడా ఒకటి పైకివస్తున్నదని నా అనుమానం. వీలైనంతత్వరలో మహారాజాను తొలగించాలని నా దృఢవిశ్వాసం" అని నజలింగప్ప అన్నాడు. కర్ణాటక ఏకీకరణలో ఆలస్యంజరిగితే కాంగ్రెస్ బలహీనపడుతుందని, ఆంధ్రులకు రాష్ట్రం లభిస్తున్నప్పుడు, కర్ణాటకులకు రాష్ట్రం యేర్పాటు చేయకపోవడానికి అభ్యంతరమేమిటో బోధపడుటలేదని, నిజలింగప్ప అన్నాడు.

# విశాఖపట్నం నౌకా నిర్మాణశాల

## ఇండియా ప్రభుత్వ నిర్వహణ సంకల్పం

న్యూఢిల్లీ, డిసెంబరు 18: విశాఖపట్టణంలోని సింధియా కంపెనీవారి నౌకా నిర్మాణశాలకు భారతప్రభుత్వంవారుద్రవ్యమును సమకూర్చి నిర్వహించుటకు తగిన సాధనోపాయములను గురించి భారతప్రభుత్వము తప్పక ఆలోచించగలదని పరిశ్రమల శాఖమంత్రి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీగారు సెలవిచ్చుట తెలిపిరి. నౌకాశాల కార్మిక సంఘాధ్యక్షుడు జి. లచ్చన్నగారును, ఉద్యోగుల సంఘాధ్యక్షుడైన వి. రామారావుగారును, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ విశాఖజిల్లాకార్యదర్శి నరసింగరావుగారును కలిసి తనవద్దకు రాయబారము వచ్చినప్పుడు వారి విషయమును తెలిపిరి.

రాయబారవర్గము పరిశ్రమల మంత్రిగారి కార్యదర్శి భూతలింగంగారినికూడా కలుసుకుని మాట్లాడిరి.

కార్మికులను తగ్గించుటకై తొలగించవలెనని ప్రయత్నములు జరుగుచున్నవనియూ, కార్మికులను నష్టమురాకుండా చూడవలెననియూ రాయబారవర్గము విన్నవించిరి. నౌకానిర్మాణశాలకు తగిన ద్రవ్యమును ప్రభుత్వము సమకూర్చకలిగినయెడల ఈ సమస్యలన్నియూ పరిష్కారం కాగలవని ముఖర్జీగారు తెలిపిరి. ఈ విషయమై కొలదిరోజులలోనే ఒక నిర్ణయము జరుగునని తెలిపిరి.

వెనుక భారతప్రభుత్వ సంస్థాన సహాయశాఖా కార్యదర్శిగా పని చేసి మూడు పర్యాయాలుగా సింధియా కంపెనీయందు పని చేయుచున్న దండేకర్ గారిని కూడా రాయబారవర్గము కలుసుకుని మాట్లాడిరి. డిసెంబరు 21 వ తేదీన రాయబార వర్గమును బొంబాయికి రావలసినదనియూ, కట్టకడపటి చర్చలను అక్కడ చేయవచ్చుననియూ దండేకర్‌గారు తెలిపిరి.

డా॥ పట్టాభి, కళా వెంకట్రావు, ఆచార్య రంగా, భారతజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షుడు ఖండూభాయ్ దేశాయ్‌గార్లను కలుసుకుని కూడా రాయబారవర్గం మాట్లాడిరి.

## 'ప్రజలు తమ శ్రేయస్సు కోరే వారికే ఓటుచెయ్యాలి'

### జయప్రకాశ్ నారాయణ్ ఉద్బోధ

సికంద్రాబాద్, డిసెంబరు 17: సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ్ నేడు ఆదిలాబాద్ జిల్లా మంచిరాల గ్రామరైతుల సభలో ప్రసంగిస్తూ, ప్రజలు తమ శ్రేయోభిలాషులకు మాత్రమే ఓటుచేయ్యాలని ఉద్బోధించాడు. కాంగ్రెస్ ప్రభుత్వం పేదలను, దుర్గతిని వారిని దోచుకొని, ఆధనాన్ని గవర్నరు జనరల్, రాజప్రముఖులు, నిజాంల మధ్య పంచుతున్నదన్నాడు.

శ్రీరంగంలోని వైకుంఠ ఏకాదశి ఉత్సవానికై డిసెంబరు 21 నుండి జనవరి 10 తేదీవరకు పోవు యాత్రికులు టీకాలు వేయించుకొని సర్టిఫికేట్లు తీసుకపోవాలని ఆరోగ్యశాఖాధికార్లు ప్రకటించుచున్నారు.

# అపహృత ప్రజల ఉద్ధరణ

## ప్రభుత్వ బిల్లుపై పార్లమెంటులో చర్చ

న్యూఢిల్లీ, డిసెంబర్ 16: భారత ప్రభుత్వం పాకిస్తాన్‌తో వ్యవహరించే టప్పుడు 'దుర్బల' విధానాన్ని అనుసరిస్తున్నదన్న ఆరోపణలను కేంద్ర మంత్రివర్గ సభ్యుడు గోపాలస్వామి అయ్యంగార్ నేడు పార్లమెంటులో సమాధానమిచ్చాడు. యుద్ధం ప్రారంభించటం, ప్రతీకారానికి దిగటం అన్నవి మినహా, అపహృత ప్రజల ఉద్ధరణ విషయమై పాకిస్తాన్‌తో సమాధానానికి దిగటానికి ఇండియా చేయని ప్రయత్నమంటూ లేదనీ, నాగరిక ప్రభుత్వమని పిలుచుకుంటున్న భారత ప్రభుత్వం పాకిస్తాన్ ప్రభుత్వాన్ని ఆ విషయంలో కోరటంకన్నా చేసేది లేదని ఆయన అన్నారు.

పాకిస్తానుకు చెందిన అపహృతలను ఉద్ధరించే నిమిత్తం ఆయన ఒక బిల్లును ప్రతిపాదించగా ఈ చర్చ జరిగినది.

### అపహృత భారతీయులమాట ఏమిటి?

ప్రా॥ షిబ్బన్‌లాల్ సక్సెనా బిల్లును సమర్థిస్తూ, పాకిస్తాన్‌కు చెందిన అపహృత జనాన్ని మన దేశంలోనుంచి ఉద్ధరించటానికి ఉన్న ఈ బిల్లును నేను సమర్థిస్తున్నాను. కాని పాకిస్తానులోకి అపహరించి తీసుకునిపోబడిన ముస్లిమేతరులను ఉద్ధరించటానికి భారతప్రభుత్వం చేయవలసిన పని చేసిందేమాత్రం చెప్పక తప్పదు. ఇండియాకు వచ్చే జనపనార పడవలను పాకిస్తాన్ నిలిపివేస్తే, భారత ప్రభుత్వం ఆ దేశంతో ఆర్థిక సంబంధాలను తెంచుకొనే ఆలోచన చేస్తున్నట్లు వింటున్నాము. కాని ముస్లిమేతర అపహృతల ఉద్ధరణకు ప్రభుత్వం అటువంటి గట్టిపని ఒకటికూడా చేయలేదనటానికి విచారిస్తున్నాను", అని అన్నాడు.

రోహిణీకుమార్ చౌధరి బిల్లు సిద్ధాంతాన్నీ, ఆశయాన్నీ సమర్థించారుకాని 'ఉద్ధరణ విధానం' ప్రజాపీడనానికి కారణంఅయేఅవకాశం ఉన్నదని హెచ్చరించాడు.

"బిల్లులో పోలీసు అధికారులకు విపరీతాధికారాలు ఇవ్వబడ్డవి. 'అపహృత' అని చెప్పబడిన స్త్రీలందరినీ తను వ్యక్తిగత రక్షణకిందికి తీసుకునే అధికారం వాళ్ళకు ఇవ్వబడ్డది. దీనివల్ల అపహృత స్త్రీలను 'పెనంమీద నుంచి మంగలంలోకి దూకినట్లు' అవుతుంది ఉద్ధరించబడినవారు శిబిరాల్లో ఏవిధంగా చూడబడతారో బిల్లు వివరించలేదు."అనిఆయన్ని విమర్శించాడు.

అమ్ముస్వామినాథన్ కూడా సమర్థిస్తూ పోలీసుల కివ్వబడే విపరీతాధికారాలవల్ల, పాకిస్తానుకు వెళ్ళటం ఇష్టంలేని స్త్రీలను బలవంతంగా పంపబడటమన్నది జరగకుండా జాగ్రత్త తీసుకోవాలని హెచ్చరించింది.

పండిత ఠక్రూదాస్ భార్గవ మాట్లాడుతూ పాకిస్తాన్ ఏమిచేసినా, దుర్గతిపాలైన అపహృతలను ఉద్ధరించి గౌరవజీవనం గడిపే బాధ్యత మనమీద ఉన్నదని అన్నాడు. బిల్లు అధికారాన్ని రెండుమూడేళ్ళవరకే పరిమితం చేయాలనీ, అపహృతలకోసం ఇళ్ళను సోదా చేసే అధికారం పదిన్స్పెక్టరుకు తక్కువ ఉద్యోగులకు ఇవ్వరాదనీ ఆయన అన్నాడు.

రేణుకారాయ్ ప్రసంగిస్తూ వెనకి త్రిప్పబడకోరని స్త్రీలు మాటికి ఏఒక్కరో ఉంటారనీ, అందువల్ల వెనక్కి పంపేటప్పుడు ఒక విచారణ సంఘం వారి వ్యవహారాలను శ్రద్ధగా పరిశీలించాలనీ అందులో ఒక్క స్త్రీ అయినా సభ్యురాలుగా వుండాలనీ ప్రతిపాదించినది.

### అయ్యంగార్ జవాబు

చర్చకుసమాధానమిస్తూ గోపాలస్వామి అయ్యంగార్ ఈ క్రింది విధంగా ప్రసంగించాడు.

"బిల్లు ముఖ్య సూత్రానికి అంతా అంగీకరించినందుకు సంతోషం. పాకిస్తాన్ అపహృతల ఉద్ధరణకై చేసుకున్న ఒడంబడికను భంగపరచినట్లు చాలమంది విమర్శించారు. కాని ముస్లిం అపహృతలను ముస్లిమేతర అపహృతలకు హామీగా ఉంచటమన్నది నాగరికతగల దేశం చేయతగినపనికాదు. సీతకోసం రాముడు రావణునిమీద యుద్ధం చేసినట్లు చేయటం మనకూ, లోకస్వతంత్ర దేశంలో వ్యవహరించేటప్పుడు ఆ దేశానికి నచ్చచెప్పప్రయత్నించటంకన్నా మనమేమీ చేయలేము. పాకిస్తాన్‌మీద యుద్ధాన్ని ప్రకటించమని కొందరు సూచించారు కాని మనంమాత్రం స్త్రీలను అపహరించకుండా ఉన్నాము. పాకిస్తాన్ ప్రభుత్వం అపహృతల ఉద్ధరణలో సహకరిస్తున్నది కాని ప్రజలుమాత్రం పూర్తిగా వ్యతిరేకిస్తున్నారు.

గత 6 నెలలలోనూ ఇండియాలో ఉద్ధరించబడిన అపహృతల సంఖ్య పాకిస్తాన్‌లో ఉద్ధరించబడినవారి సంఖ్యకు రెట్టింపు 10 రెట్లు వుంటుంది. కాని పశ్చిమ పంజాబ్ ముస్లింలీగ్ ఈ విషయమై ఇప్పుడు శ్రద్ధ తీసుకుంటున్నది. పోలీసు అధికారులకు యివ్వబడిన అధికారాలు విపరీతంగా లేవు."

# '1948 జనవరి 10 న బీబీనగర్‌లో ఏ ముస్లింగృహం దోపిడీజరగలేదు'

## బీబీనగర్ కేసు విచారణలో ఉపాధ్యాయిని రత్నమ్మ సాక్ష్యం

హైద్రాబాద్, డిసెంబరు 17: బీబీనగర్ కేసు విచారిస్తున్న ప్రత్యేక న్యాయవిచారణ సంఘంవారు నేడు సమావేశమైనప్పుడు రత్నమ్మ అను ఒకస్కూలుఉపాధ్యాయిని సాక్ష్యమిస్తూ, 1948 జనవరి 10 వ తేదీ సాయంకాలం రజాకర్లు తనయింటిని దోచుకొన్నారని చెప్పింది. మెహతాబ్‌ఖాన్, మహమ్మదు ఖ్వాజా ముద్దాయిల తరఫు వకీలైన రషీద్ సిద్దికీ అడిగినప్రశ్నలకు సమాధానంగా గతసంవత్సరం జనవరి 10 వ తేదీ సాయంకాలం బీబీనగర్‌లో ముస్లింల గృహము లేవీ దోచుకొనబడలేదని ఆమె చెప్పింది. కాని గ్రామంలోని హిందూగృహాలు దోచుకోబడటంచే, హిందువులు ప్రతీకారమేమయినా చేస్తారేమోనని రజాకర్ల ముసాఫిర్ ఖానాకువెళ్ళి ఆరాత్రి అక్కడ గడిపి మరుసటిరోజు ఉదయం గ్రామానికి వచ్చారనికూడ ఆమె చెప్పింది. బీబీనగర్ కాంగ్రెస్‌కు అధ్యక్షుడున్నట్లు తనకు తెలియదనీ, అసలు గ్రామంలో కాంగ్రెస్ కార్యాలయం ఉన్నట్లుకూడ తనకు తెలియదని ఆమె చెప్పింది. రజాకర్లు గ్రామంపై దాడి చేసేంతవరకు యీమె పనిచేస్తున్న బాలికాపాఠశాల రెండునెలల పాటు మూసివేయబడింది. క్రాస్ ముగిసేసరికి రత్నమ్మను ముద్దాయిపక్షాన్ని క్రాసు పరీక్షచెయ్యటం పూర్తికాలేదు.

# హైద్రాబాద్‌కు నేడే రాజాజీ ఆగమనం

హైద్రాబాద్, డిసెంబరు 18: ఇండియా గవర్నరుజనరల్ రాజగోపాలాచారిగారు 19 వ తేదీన హైద్రాబాదు వస్తున్నారు. ఆయన యిక్కడ 22 వ తేదీ వరకు ఉంటారు. 22 వ తేదీన బయలుదేరి ఔరంగాబాద్ వెళ్ళి ఎల్లోరా, అజంతా గుహలను సందర్శించి 24 వ తేదీన ఢిల్లీ వెళ్లుతారు.

సంస్థానానికివస్తున్న ప్రథమ భారతీయ గవర్నరు జనరలుకు ప్రజలు ఘనమైన స్వాగత మివ్వగలరని నమ్ముతున్నానని హైద్రాబాద్ ప్రధానమంత్రి ఎం. కె. వెల్లోడీ నేడొక ప్రకటన చేశారు.

# డిసెంబరునెల శిస్తు వాయిదా

కర్నూలు, డిసెంబర్ 17: కంభం తాలూకాలోని భోగోలు, కొకర్ల, లింగాపురం, ఎర్రబాలెం గ్రామాలు కరువువల్ల నష్టపడుటచే కర్నూలుజిల్లాకలెక్టరు మి. వి. చలపతి మొదలియార్ గారు ఆ గ్రామాలలో డిసెంబరు నెల శిస్తు వసూలుచేయుటను వాయిదా వేశారని తెలుస్తున్నది.

# సిబ్బంది, ఆర్థిక ఉపసంఘము

## శాఖాధిపతులతో చర్చలు

మదరాసు, డిసెంబరు 18: విభజనసంఘ సిబ్బంది ఉపసంఘమువారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సందర్భమున సెక్రటేరియటు పునర్నిర్మాణము గురించి నిన్న సమావేశమై చర్చలు కొనసాగించిరి. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. రామునిమీనన్ అధ్యక్షత వహించిరి.

సెక్రటేరియటు పునర్నిర్మాణమునకు సంబంధించిన యాద్విషయములను డిపార్టుమెంటుల కార్యదర్శులను, అసిస్టెంట్ బాయింటు కార్యదర్శులతో సంప్రదించిరి.

వాణిజ్యాభ్యుదయ డైరెక్టరు, సర్జను జనరలు, ప్రజారోగ్యడైరెక్టరు, రహదార్ల ఛీఫ్ ఇంజనీరు, విద్యాశాఖ డైరెక్టరు, పోలీసు ఇన్స్పెక్టరు జనరలుతో నిన్న ఉపసంఘమువారు చర్చించిరి.

ఉపసంఘము మరల సోమవారము సమావేశమై విభజనసంఘము పరిశీలనకు సూచనలను అందజేయుదురని తెలియుచున్నది.

ఆర్థిక ఉపసంఘముకూడ సమావేశమై ఆంధ్ర ఆంధ్రేతర రాష్ట్రములకు ఆస్తి అప్పుల పంపిణీగురించి చర్చించిరి. మరల సోమవారము సమావేశమయ్యెదరు.

# వరంగల్లుజిల్లా కాంగ్రెస్ ఎన్నికలు

## అధ్యక్షులుగా బొమ్మకంటి సత్యనారాయణరావుగారి ఎన్నిక

ఖమ్మంమెట్టు, డిసెంబరు 16: సంస్థాన కాంగ్రెస్ నిర్ణయించిన ప్రకారం నిన్న వరంగల్లుజిల్లా కాంగ్రెస్ ఎన్నికలు జరిగినవి. జిల్లా కాంగ్రెస్ ఎన్నికల అధికారి కొలిపాక ఆనందరావుగారు ఎన్నికలు జరిపించారు. జిల్లా సమితికి అధ్యక్షులుగా బొమ్మకంటి సత్యనారాయణరావు గారు, కార్యదర్శులుగా చావా వెంకటకోటయ్య కొలిపాక వెంకటకిషన్‌రావుగార్లు ఎన్నుకోబడినారు. కార్యవర్గంలో కామరగిరి నారాయణరావు, శాఖమూరి నారాయణ, జేలి కేశవరెడ్డి, ధంసాల చంద్రమౌళీశ్వరరావు, గంగవరపు లక్ష్మీనారాయణ, అరిశెబోయిన గోపాలరావుగారలు వున్నారు. అధ్యక్ష కార్యదర్శులు ముగ్గురుకాక మరి ముగ్గురుకూడా ఖమ్మం తాలూకానుండి కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోబడినారు. ఎన్నికలు ప్రశాంత వాతావరణంలో తర్జనభర్జన లేకుండా మాత్రమే కాకుండా ఓట్లు లెక్కపెట్టవలసిన అవసరంకూడా లేకుండా ఎన్నికలు జరిగినవి.

న్యూఢిల్లీ, డిసెంబరు 16: కొంగబ్యాపారస్తులు, పన్నులు ఎగవేసేవారికి, మరణశిక్షగాని, యావజ్జీవకారాగారము గాని విధించాలని శిఫార్సు చేస్తూ, కె. టి. షా పార్లమెంటులో, ఒక బిల్లు ప్రతిపాదించాడు.

# హిందూ ధర్మ క్రోడీకరణ బిల్లు

## కాశేశ్వరరావుగారి సమర్థన

విజయవాడ, డిసెంబరు 10: శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు (ఎం. ఎల్. ఏ.) గారు, హిందూ ధర్మ క్రోడీకరణ బిల్లును బలపరుస్తూ ఒక ప్రకటన చేశారు. ఈ బిల్లును గురించిన వ్యతిరేకమంతా నిరర్థకమైనదన్నారు.

దీనిని వ్యతిరేకిస్తున్నవారి వైఖరిని విమర్శిస్తూ, వీరి ప్రయత్నమంతా ఏదో ఒక విధంగా విలంబనం చేద్దామనేనని కాళేశ్వరరావుగారు ఉద్ఘాటించారు. దేశంలోని ప్రజలలో అధిక సంఖ్యాకులు, స్త్రీ పురుషులకు సమాన హక్కులను కోరేవారేనని బిల్లును వ్యతిరేకించే కొద్దిమంది వ్యక్తులు చేసే నల్లజెండా ప్రదర్శనలవలన నినాదాల వలన శాసనసభ్యులు బెదిరిపోరనీ కాళేశ్వరరావుగారన్నారు.

## చిత్తూరు జిల్లా పత్రికా ప్రతినిధుల సమావేశము

చిత్తూరు, డిసెంబరు 13: చిత్తూరు జిల్లా కలెక్టరుగారు మొన్న జిల్లా పత్రికా విలేఖరులను తమ ఆఫీసులో సమావేశపరచిరి. కాని కలెక్టరుగారు జ్వరంతో సెలవు పోవడంవలన డిప్యూటీ కలెక్టరుగారగు జనాబ్ ఫజులుల్లాఖానుగారు అధ్యక్షత వహించిరి.

అధ్యక్షులు ప్రసంగిస్తూ పత్రికావిలేఖరులు అన్నివిధాలైన వార్తలు పంపగలిగిన అన్ని కాశాలు వృద్ధిపరుస్తామనిరి. పత్రికావిలేఖరులు తమకు ప్రతినెల ఒక సమావేశము జరగడానికి అవకాశాలు కల్గింపవలెనని కోరారు.

అధ్యక్షులు సమాధానం చెప్పుతూ నెలవారీగా పత్రికా ప్రతినిధుల సమావేశం జరపు విషయంలో కాలనిర్ణయం చేయుటకు కలెక్టరుగారి అభిప్రాయం అవసరమనీ, చిత్తూరులోనే కాకుండా మదనపల్లి, తిరుపతులలో మరి రెండు విలేఖరుల సమావేశ కేంద్రాలం ఏర్పాటుచేసి కలెక్టరుగారు క్యాంపులో ఉన్నప్పుడు కూడా సమావేశాలు నిరాఘాటంగా జరపడానికి అవకాశం కలిగిస్తామనీ అన్నారు. (స్వ. వి.)

## కృష్ణాజిల్లా హిందీ పండిత పరిషత్తు

యలమర్రు, డిసెంబరు 14: కృష్ణాజిల్లాలోని సెకండరీ పాఠశాలలందు గల హిందీ పండితులు తొడంకిబోర్డు హైస్కూలులో ఉప్పలూరి శ్రీరామకృష్ణయ్యగారి అధ్యక్షతను సమావేశమయిరి. పాట్లూరి హనుమంతరావుగారు, అధ్యక్షులు తదితరులు, పండితపరిషత్తు యావశ్యకతను గురించి ఉపన్యసించిరి. అనంతరము "కృష్ణాజిల్లా హిందీ పండితపరిషత్తు" స్థాపించబడినది. అన్నె కేశవాచార్యశాస్త్రి గారు అధ్యక్షులుగాను ఉప్పలూరి శ్రీరామకృష్ణయ్యగారు కార్యదర్శిగాను, చిర్రాపూరి రామకృష్ణారావు, పాట్లూరి హనుమంతరావు, కొకాని పట్టాభిరామయ్య, జొన్నలగడ్డ వెంకటేశ్వర్లు, పాట్లూరి సుబ్బారావు, భట్ట కోటేశ్వరరావు, కల్యాదుర్గాప్రసాదరావుగారలు కార్యనిర్వాహకవర్గముగాను యెన్నుకొనబడిరి. తర్వాత హిందీపండితులకు ప్రభుత్వంవారు యిచ్చిన జీతనము లస్కేళ్లను అమలుపరచవలసినదిగా జిల్లాబోర్డు అధ్యక్షులను కోరుతూ తీర్మానించిరి.

## గుంటూరు పండిత పరిషత్తు వార్షిక సభ

గుంటూరు, డిసెంబరు 15: రాష్ట్రీ యోపాధ్యాయ పండిత పరిషదుపసంఘము గుంటూరుశాఖ వార్షికసభ గత శుక్రవారం నాడు యు. ఎల్. సి. ఎం. హైస్కూలు భవనమున వి. వి. నరసింహాచార్యులుగారి యధ్యక్షతక్రింద జరిగినది. నూతన సంవత్సరమునకు మండలపర్తి ఉపేంద్రవర్మగారు అధ్యక్షులుగను, నేతి సుబ్బారావుగారు ప్రధాన కార్యదర్శిగను, దిట్టకవి రామారావుగారు సహాయ కార్యదర్శిగను ఏకగ్రీవముగ ఎన్నుకొనబడిరి. ఈ యుపసంఘమునుండి ప్రధాన పరిషత్తునకు నేతి సుబ్బారావుగారిని, చామర్తి సన్నయ్యశాస్త్రిగారిని కార్యనిర్వాహకవర్గ సభ్యులనుగ ఎన్నుకొనిరి.

ఉన్నత పాఠశాలా తరగతులలో పని చేయుచున్న పండితులకందరికిని బి యిడిలతో సమానమైన జీతవ ప్రతిపత్తుల నొసంగవలెననీ, సీనియర్ పండితులకు సర్వీసునుబట్టి హైస్కేలుని ఇప్పించవలెననీ జూనియర్ పండితులకందరకిని 60-4-120 స్కేలు ఇప్పించవలెనని ప్రభుత్వమును కోరుచు తీర్మానములు చేసిరి.

## గంటిపల్లి పాలెంలో అగ్నిప్రమాదం

గంటిపల్లి పాలెం, డిసెంబరు 14: కొత్తపేట తాలూకా గంటిపల్లిపాలెం గ్రామంలో మొన్న మధ్యాహ్నం అగ్నిప్రమాదము సంభవించి 95 యిండ్లు పరసురామ ప్రీతియయినవి. నష్టం సుమారు రు 19000 లుండునని అంచనా వేయబడినది.

# సభలు సమావేశములు

## తూర్పు గోదావరి జిల్లా పశు ప్రదర్శనం

కాకినాడ, డిసెంబరు 16: తూర్పుగోదావరి జిల్లా పశు ప్రదర్శనం 1950 జనవరి 21, 22 తేదీలలో కాకినాడలో జరుగుతుంది. జిల్లాలోని రైతులు తమ తమ ఉత్తమ జాతి పశువులను ప్రదర్శనమునకు పంపవలసిందని ప్రదర్శన సంఘంవారు కోరుతున్నారు.

ఆంధ్ర నాటక కళాపరిషత్తు కార్యవర్గసమావేశము యీ నెల 24 వ తేదీ మధ్యాహ్నం గం. 2-30 లకు విజయవాడలో ఫేమస్ ఫిలిమ్స్ వారి కార్యాలయమునందు జరుగును.

తిరువూరు తాలూకా హోమియోపతి వైద్యుల సంఘ సమావేశం జనవరి 1 న చల్లపల్లిలో జరుగును.

కైకలూరు తాలూకా గ్రామోద్యోగుల సంఘ వార్షికోత్సవము యీ నెల 29 న కైకలూరులోని బాలకోటేశ్వర టూరింగు టాకీసులో జరుగును.

భాషారాష్ట్రసమితి ఆంధ్రశాఖ కార్యవర్గసమావేశం యీ నెల 25 న మచిలీపట్నం ఆంధ్రకేసరి పత్రికా కార్యాలయంలో జరుగుతుందని పానుగంటి వెంకట నాగభూషణంగారు వ్రాస్తున్నారు.

## హిందూపురం ఆర్యసమాజ కార్యకర్తల సమావేశం

హిందూపురం, డిసెంబరు 15: స్థానిక ఆర్యసమాజకార్యకర్తల సమావేశం మంగళవారమునాడు ఎలెక్ట్రికల్ ఎంజినియరు కె. యస్. రావుగారిగృహంలో జరిగింది. ఆర్యసుఖదేవ వర్మగారు ఆర్యసమాజ సిద్ధాంతములను విపులముగ విశదీకరించిరి. కె. యస్. రావుగారు యజ్ఞములు, వాటివలని లాభములు, ప్రాణాయామమును గురించి ప్రసంగించిరి. కళా ప్రేమీ మండలి వ్యవస్థాపకులు ఎన్. కె. శ్రీపతి రావుగారు యోగము, ప్రాణాయామము, వీటి ద్వారా మానవుడు మోక్షమును, శాశ్వతసుఖమును పొందుమార్గములను గురించి వివరించిరి. అంతకుముందు ఆర్యసమాజ సిద్ధాంతముల ప్రకారం యజ్ఞము జరుపబడెను. (స్వ. వి.)

## పెదపట్నం గ్రామంలో కొత్త పోష్టాఫీసు

మాసేపల్లి, డిసెంబరు 15: ఇంతవరకు మాసేపల్లి పోస్టాఫీసు క్రింద ఉంటూయున్న పెదపట్నం గ్రామంలో అమలాపురం సబుడివిజన్ పోస్టలు ఇన్స్పెక్టరు గారు గత శనివారంనాడు ఒక బ్రాంచి పోస్టాఫీసు ఏర్పాటుచేశారు. పోస్టుమాస్టరుగ జేకేరాజు గోపాలరావుగారిని నియమించారు.

## బందరు జాతీయ సేవాసంఘ సమావేశం

బందరు, డిసెంబరు 13: స్థానికజాతీయ సేవాసంఘంవారు ఆదివారం సాయంత్రం పి. లక్ష్మీపతిశాస్త్రిగారి అధ్యక్షతన సమావేశమై, మద్రాసు ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు, రైతులు ఈ సం॥ము నకు చెల్లించే భూమిశిస్తుకు సమావేశమైన మొత్తమును ప్రభుత్వమునకు నిర్బంధంగా అప్పుగా నివ్వాలని ప్రతిపాదించనున్న బిల్లుకు అసమ్మతి తెలుపుతూ, శాసనసభ కాంగ్రెస్‌పార్టీని ఆ బిల్లును అసమ్మతి తెలుపవలెనని కోరుతూ తీర్మానించారు.

## మంగళగిరిలో కూరగాయల మార్కెటు

### స్థానిక సంస్థల ఇన్స్పెక్టరుచే శంకుస్థాపన

మంగళగిరి, డిసెంబరు 16: స్థానిక పంచాయతీ బోర్డుచే యిక్కడ నిర్మింపబడనున్న కూరగాయల మార్కెటుకు మద్రాసు స్థానిక సంస్థల ఇన్స్పెక్టరు టి. ప్రభాకరరావునాయుడుగారు నిన్న శంకుస్థాపన చేశారు. ఈ సందర్భమున మేడూరి నాగేశ్వరరావు ఎం. ఎల్. ఎ. గారి అధ్యక్షతను జరిగిన సభలో ప్రభాకరరావు నాయుడుగారికి ఒక వెండి తాపీ బహూకరింపబడింది. దానిని వేలం వెయ్యగా రూ 150 లు వచ్చింది. ఈ ధనం మద్రాసు గవర్నరు క్షేమనిధికి పంపబడుతుంది. పంచాయతీ బోర్డు అధ్యక్షులు చింతకింది కనకయ్యగారి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది. స్వ. వి.

## తిరుపతి పురపాలకసంఘ ప్రత్యేక సమావేశం

తిరుపతి, డిసెంబరు 17: తిరుపతి పురపాలక సంఘాధ్యక్షుడు కె. రంగస్వామి అయ్యంగార్ పై విశ్వాసరాహిత్య తీర్మానమును చర్చించడానికి నిన్న జరిగిన సంఘ ప్రత్యేక సమావేశం అయ్యంగార్ ఇదివరకే రాజీనామా పెట్టినందువల, అధ్యక్షుడు దాని నంగీకరించినందువల్ల చర్చలేకుండానే ముగిసినది. సభకు చంద్రగిరి అసిస్టెంటు కలెక్టరు కె. శివసుబ్రహ్మణ్యంగారధ్యక్షత వహించారు.

# "సైనికులను స్నేహితులుగా భావించాలి"

## నౌకాదినోత్సవం: రాజాజీ ఉద్బోధ

మదరాసు, డిసెంబరు 18: మన రక్షణదళంలోని నావికులను, సైనికులను, వైమానికులను, పోలీసులను స్నేహితులుగా చూడవలెననీ వారిపట్ల గల వ్యతిరేక భావము ద్వేషమును తొలగించుకొని ఉపాయకరము, కష్టము అత్యావశ్యకము ఈ పనులు చేయు మనుష్యులను పరమ స్నేహితులుగా ఎంచుకొనవలెనని నావికాదినోత్సవ సందర్భమున లె. క. యస్. పి. యన్. నాయర్ ఇచ్చినఅల్పాహారవిందులో ప్రసంగించుచూ భారత గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు విజ్ఞప్తి చేశారు.

మౌంటురోడ్‌లోని ఆఫీసర్ల ఇన్స్టిట్యూటులో జరిగిన ఉత్సవమునకు మదరాసు గవర్నరు శ్రీ భావనగర్ మహారాజా భావనగర్ మహారాణి, మదరాసు ప్రధాని శ్రీ పి. యస్. కుమారస్వామిరాజా, మదరాసు మంత్రులు వచ్చిరి.

రెసిడెంటు నావికా ఉద్యోగి లె॥ క॥ నాయర్ గవర్నరు జనరలు, మదరాసు గవర్నరు దంపతులకు స్వాగతమిచ్చుచూ ప్రజలు నావికుల మధ్య సన్నిహితము చేకూర్చుటకు నావికా దినోత్సవము జరుపబడుచున్నదనిరి.

గవర్నరు జనరలు మాట్లాడుచు ఇట్లు చెప్పిరి:— నావాకవలన మీరు ఎంత గౌరవము పొందితిమని అనుకుంటున్నారో అంతకు ఇనుమిక్కిలిగా నాకీ అవకాశము ఇచ్చినందుకు గౌరవము పొందినానని తలంచుచున్నాను. నేను లోగడ చెప్పినట్లు భారత ప్రభుత్వమునకు నావికాదళము అంటే అభిమానము వున్నది. సాధ్యమైనంతవరకు బలగమును పెంచి రక్షణ సర్వీసులలో ప్రాధాన్య మివ్వబడుతుంది. నావికాదళమును గురించి ప్రజలలో అభిమాన ఆదరములు కలుగచేయవలసిన అవసరము లేదు. నావికాదళము అంటే ప్రజలకు ఇష్టమున్నది. పోలీసులు అంటే ప్రజలు ద్వేషించిన రోజులున్నవి. ఇప్పుడు పోలీసులంటే అయిష్టములేదు, సైన్యముఅంటే ఉత్సాహము చూపించని కాలము యున్నది. సైన్యమునకూ ప్రజలకూగల సంబంధము సైనికోద్యోగులు దేశ గౌరవము స్వాతంత్ర్యమునకు గల సంబంధమును ప్రజలు గుర్తించిరి. ఇతర ప్రజలకు వారి సేనలపట్ల గల అభిమానము మన ప్రజకు ఉన్నది. నావికాదళము అవసరము గురించి ప్రజలలో సందేహ మెప్పుడూ లేదు నావికులు ఎప్పుడూ ప్రజలను కాల్చలేదు. మర్దన చేయలేదు. అందువలన భారత దేశములో నావికులకు మంచి గౌరవమున్నది. ఇందుకు సందేహమేమీ లేదు. అధికారములో వున్నవానివలె గాక ప్రజల మనస్సు తెలుసుకొనుటకు వీలుగా మాట్లాడుచున్నాను.

మనకుగల నావికా సంపత్తి గురించి ప్రజలకు బాగా తెలియదు. న్యూఢిల్లీలో నావికా చిహ్నములు, పతాకలను చూసి నావికా దళము అంటే రోడ్డు మీద నడిచే కావలాంటిదని అనుకుంటున్నారు. న్యూఢిల్లీలో నావికా శాఖ ఎట్లా పనిచేయునో వారికి తెలియదు. ఇతర దేశముల నావికా దళములు సముద్రములలో పని చేయుచుండగా ఢిల్లీలో నావికా దళము పని ఏమిటో వారికి అర్థము కాకుండా యున్నది. నవీన యుద్ధ తంత్రములో పోరాడువారు పరిపాలన మీద ఆధారపడవలసి యున్నది. అందువలన నావికాదళ కార్యాలయము రాజధానిదగ్గర వుండుట అవసరం. నావికాదళములోని వ్యక్తుల స్వభావము వేరు. సైనికునికి, నావికునికి తేడా చూడగానే తెలియగలదు. సైనికుడు కర్కశుడుగా కనిపించును. నావికుడు చిరునవ్వుతో కనిపించును. ఇది వాళ్లు తేలుతూవుండేనీళ్ల ప్రభావము. దీర్ఘకాల కేటాయింపువలన ఒక్కుచేరగానే నావికులు మానవసంపర్కముకొరకు తహతహలాడుతూ వుంటారు. స్వభావతః ఒక సర్వీసుకు మరొక సర్వీసుకు తేడావున్నది. పోలీసులు నేను, ఎవరిని చూచి భయపడ్డారో అనేక ప్రమాదముల మధ్య పనిచేయుచున్నారు నూతన యుగములో వున్నాము. మనరక్షణ సర్వీసువారి నందరినీ స్నేహితులు గాచించుకోవలెను. ప్రజలు దృక్పథమును మార్చుకొనవలెను. పిల్లలు పోలీసులను చూసి భయపడకూడదు.

మన నావికాదళము చాల చిన్నది. మనకు ఒక పతాకనావ 3 డెస్ట్రాయర్లు వున్నవి. పతాకనావ చాల అందముగా వుంటుంది. అది మన అడ్మిరల్ నావ. డెస్ట్రాయరు అంటే రావణుడని అనుకొనరు. శత్రువును సంహరించే సాయుధ చిన్ననావ. మనకు రంజిత్ రాజపుటానా, రాణా 3 డెస్ట్రాయర్లున్నవి. ఫ్రిగేట్లు 6 మైన్ స్వీపర్లున్నవి. ఇవన్నీ చాల అవసరము. ఇవిగాక ఇంకా చిన్న చిన్నవి చాల వున్నవి. కోస్టల్ సర్వే సర్వీసు వున్నది. ఇదికూడ చాల ముఖ్యమైనది. క్రమేపి నావికాదళమును వృద్ధిచేయుట నావికా శాఖ ఉద్దేశ్యము.

మనకు 564 ఉద్యోగులు 5000 మంది జనముండిరి. ఇవ్వాళ 800 ఉద్యోగులు, 7700 మంది జనమూ వున్నారు. వర్షావర్షము పెంచవలసియున్నది. ప్రతివారికీ శిక్షణ ఇవ్వవలసియున్నది. మనవారు ఒకసారి ఈ పనికి పూనుకొనిన ఇతర దేశముల వారికి తీసిపోరు. మన ఉద్యోగులను పర్మనెంటు చేసుకొనుటకు బ్రిటిష్‌వారు సంతోషముతో అంగీకరించెదరు.

ఏ దేశమూ పరస్పర సహాయములేనిదే రక్షించుకోజాలదు. అయితే ప్రతివారు భాగము పంచుకొనవలెను. మనవంతు మనము చేయనియెడల వీళ్లు సహాయము పొందతగినవారు అని అనుకోరు. ఇది ప్రపంచ సహకారమునకు సంబంధించినది. సహకారసహాయము పొందుటకు మనము అర్హులుగా వుండవలెను. అందువలనే చిన్నదైనా సమర్థమైన నావికాదళమును పోషించవలెను.

ఇప్పుడు కాకపోయినా రేపైనా మనం సముద్రవ్యాపారమును సాగించవలసియున్నది వ్యాపార నౌకలున్నప్పుడు నావికాదళముకూడా వుండవలెను. యువకులు నావికా జీవనసిద్ధము కావలెను. ఈపనికి అందరూ పనికిరారు. ఆరోగ్యము ధైర్యము గలవారు ముందుకు రావలెను. ఏదో రోజూ అంతా చావవలసిందే. సైనికుడుగా మరణించటము మంచిది. నావికా దళములో చేరి గౌరవము పొందండి. నేను గవర్నరు జనరలుగామాట్లాడలేదు స్నేహితులతో మాట్లాడినట్లు మాట్లాడినాను. ఇతరచోటకు వెళ్లినప్పుడు హుందాతో దాక్షిణ్యము నుంటున్నాను, మదరాసులో వర్తిమను మీలో ఒకణ్ణిగా అనుకుంటున్నాను.

## ఆంధ్ర యూనివర్సిటీ ఆటల పోటీలు

గుంటూరు, డిసెంబరు 13: ఆంధ్ర యూనివర్సిటీవారిచే నిర్వహింపబడుచున్న వివిధ కళాశాలల 'బి' జోను పోటీ పందెములు యీ రోజుతో ఆఖరైనవి. పందెముల ఫలితములు, కాలి బంతి ఆటలో సి. ఆర్. ఆర్. కాలేజి, ఏలూరువారు గెలిచారు. నెల్లూరు వి. ఆర్. కాలేజి వారు ఆఖరి పోటీవరకు వచ్చారు.

వాలీబాలు పందెములలో గుంటూరు హిందూ కాలేజి వారు గెలిచారు. వి. ఆర్. కాలేజి నెల్లూరు ఆఖరి పందెములో ఓడిపోయారు. హాకీ ఆటలో తుది పందెము గుంటూరు హిందూ కాలేజి, గుంటూరు ఎ. సి. కాలేజివారు కాకినాడలో ఆడవలెను.

టెన్నిసు డబుల్సు పందెములో బందరు హిందూ కాలేజివారు నెల్లూరు వి. ఆర్. కాలేజిని ఓడించారు. క్రికెటు పందెములలో బాపట్ల వ్యవసాయ కళాశాలవారు విజయవాడ కాలేజివారిని ఓడించారు.

బాస్కెటు బాలు పందెములలో గుంటూరు ఎ. సి. కాలేజివారు గుంటూరు హిందూ కాలేజివారిని ఓడించారు. (స్వ. వి.)

# సంగ్రహ వార్తలు

### తెనాలి

డిసెంబరు 11 న తెనాలి పోస్టాఫీసు ఆవరణలో యస్. మాధవరావుగారి అధ్యక్షతను తెనాలిపోస్టు టెలిగ్రాఫ్ అండ్ లోయర్ గ్రేడ్ మొదలగు ఉద్యోగుల సమావేశం జరిగినది. ఈ క్రిందివారు నూతన కార్యవర్గంగా ఎన్నుకోబడిరి. అధ్యక్షులు యస్. మాధవరావు ప్రధాన కార్యదర్శి సయ్యదు అబ్బాసు, కోశాధ్యక్షుడు జి. వెంకటస్వామి గారలు. (స్వ. వి.)

### కాకినాడ

ఈ నెల 11 వ తేదీ సాయంకాలం గాంధీనగరం చర్చి ఆవరణలో హరిజన, హరిజన క్రైస్తవ సంయుక్త బహిరంగ సభ డా॥ ఎస్. బెహరాగారి అధ్యక్షత క్రింద జరిగెను. శ్రీమతి వేముగంటి పాపాయమ్మగారు జాతీయపతాకము నెగురవేసిరి. నిర్మాణ కార్యక్రమముపై ప్రజలు దృష్టిని కేంద్రీకరించి పతాకగౌరవమును నిలబెట్టవలెనని ఆమె చెప్పిరి.

కె. నారాయణరావు, డి. చక్రయ్యగారు హరిజనులకిచ్చే సౌకర్యములన్నియు ప్రభుత్వమువారు హరిజన క్రైస్తవులకు కూడ యివ్వవలసినదని కోరిరి మతము పేరు చెప్పి హరిజనక్రైస్తవులకు అన్యాయము చేయునట్టి ఉత్తరువులు ప్రభుత్వము వారు జారీచేయుచున్నందుకు నిరసన తెలియజేస్తూ, విద్యావిషయముపై హరిజనులకిచ్చే ప్రత్యేక సదుపాయములను వారితోటి వారైన హరిజన క్రైస్తవులకు కూడ కలుగజేయవలెనని ప్రభుత్వము మీదకలదని అధ్యక్షులు బెహరాగారు నుడివిరి.

హరిజనులకిచ్చే సౌకర్యాలన్నీ హరిజన క్రైస్తవుల కూడ యివ్వవలెనని, ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానములు గావించిరి. స్వ. వి.

# రాజాజీ సేవాప్రశంస

## నగరంలో చిత్రపటావిష్కరణ

చెన్నపట్నం, డిసెంబరు 18: తిరువల్లిక్కేణి క్రెసెంటు హాలులో యీ దినం రాజాజీ జన్మదినోత్సవము సందర్భమున గవర్నరుజనరలు శ్రీ రాజగోపాలాచారి చిత్రపటమును న్యా॥ ఏ. యస్. పి. అయ్యర్ గారు ఆవిష్కరించి ఈసభకు బేగం అమీరుద్దీన్ యం. యల్. ఏ. గారు అధ్యక్షత వహించిరి.

యస్. యం. ఫాసిల్ గారు న్యా॥ ఏ. యస్. పి. అయ్యర్ గారిని చిత్రపటమును బహిర్గత మొనర్చుమనికోరుచూ శ్రీ రాజాజీ మహాత్ముని విశ్వాసపాత్రుడైన శిష్యుడని యు ఆయనలో విజ్ఞానము ఘనత రెండు యిమిడియున్నవనియు పలికిరి. చెన్నరాష్ట్రములో సరియైన నాయకత్వము లేనందున పరిస్థితి అయోమయముగా నున్నదని శ్రీ రాజాజీ గవర్నరు జనరలు పదవినుండి ఒకవేళ విరమించినమీద కూడా వారు చెన్నరాజధానికి వచ్చి తిరిగి నాయకత్వము వహించితేతప్ప రాజధాని బాగుపడదనిరి.

న్యా॥ ఏ. యస్. పి. అయ్యర్ గారు చిత్రకారుడు శ్రీ కే. వి. వైద్యనాథన్ రచించిన గవర్నరుజనరలు శ్రీ రాజగోపాలాచారి చిత్రమును తెరుస్తూ శ్రీ రాజగోపాలాచారిగారు మహాత్ముడు ఆదేశించిన పంచసూత్రములైన హిందూ ముస్లిం సఖ్యత, అస్పృశ్యతా నివారణ ఖద్దరు, మద్యనిషేధము, హిందీ ప్రోత్సాహ కార్యములను నిర్వహించుటకు దీక్ష వహించిరనిరి. హిందువులు ముస్లిములు తగాదాపడకుండుటకు దేశ విభజన యే గత్యంతరమని అందరికంటే ముందుగా చాలామందికి ఆగ్రహము కలిగినప్పటికి దూరదృష్టితో వారు చాటగల్గిరి. మద్యనిషేధమువల్ల చేకలిగే 17కోట్ల రూపాయల లోటును భర్తీ చేయుటకు ఆయన తనకు కాగబుద్ధి చేత చాణుక్యుని అర్థశాస్త్రములో సూచించిన మేరకు అమ్మకపుపన్ను విధించుటకు అధికారములో నున్నపుడు తల పెట్టెను. శ్రీరాజాజీ మహాత్ముని ముఖ్యమైన అనుచరుడు. ఆయన యేమి చెప్పునో వాటిని ఆచరణలో పెట్టినాడు.

శ్రీ రాజాజి మేధాసంపత్తి శక్తిసామర్థ్యములు ఆయనకు యిప్పటి ఉన్నతపదవిని లభింపచేసియున్నవి శ్రీ రాజాజీ చర్చిలు ట్రూమెన్, రూజువెల్టులకన్న మేధావి. శ్రీ రాజాజీ యీ లోకమునకు ఉత్తమోత్తమ పురుషుడు. అట్టి మహనీయుడు యింకా అనేకయేండ్లు దేశవ్యవహారము నడుపుచూవుండునట్లు దేవుడు అనుగ్రహించవలెననిరి.

బేగం అమీరుద్దీన్‌గారు గవర్నరు జనరలు శ్రీ రాజగోపాలాచారిగారు దేశమునకు చేసిన అమోఘసేవను ప్రస్తుతించిరి. శ్రీ రాజాజీ హిందూ ముస్లిం ఐక్యత హిందీ మద్యనిషేధముల విషయములో చాలా శ్రద్ధవహించినవారనిరి, శ్రీరాజాజీవలె అందరూ యితర మతాల సిద్ధాంతములను సరిగా తెలుసుకొని వ్యవహరించితే విభేదాలు సమసిపోవు అవకాశముండునని. సంఘమువారు జాతీయనాయకుల చిత్రములలో పురుషుల చిత్రములు మాత్రమే నుంచకుండా విఖ్యాత నారీమణుల చిత్రములనుకూడా ప్రదర్శించుటకు పూనవలెనని కోరిరి.

ఫాసిల్ గారి వందనములతో సభ ముగిసెను.

# మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 19:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎడ్వర్డు బొంబాయి సేల్సుటాక్సుతోసహా రు. 77 8-0 పెట్లా బంగారు తులం 115-4-0 మూషబంగారు 118-8-0 సీమవెండి తులం 100-కి (రెడీ) 173-0-0 వెండి తులం 1-కి 1-12-6

ఆముదం

కాండీ 500 సౌనులుగలది రు. 250 255
(ఒంగోల్) నరసరావుపేట) రు. 270 275

పంచదార

| | | |
|---|---|---|
| హసన్‌పూర్ | ,, | రు. 98-14-0 |
| మోతీపూర్ | ,, | రు. 94-7-10 |











Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.